## Statement about ownership of CHANDAMAMA (Telugu)
### Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. V. REDDI, |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | Prasad Process (Pvt.) Ltd.<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VISWANATHA REDDI, |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | Managing Partner, Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS :<br>PARTNERS,<br>1. Sri. B. Viswanatha Reddi,<br>2. Sri. B. L. N. Prasad,<br>3. Sri. B. Venugopal Reddi,<br>4. Sri. B. Venkatarama Reddi,<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada, |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1967*

**B. VISWANATHA REDDI,**
*Signature of the Publisher*


నువ్వు ఏమిటి
వ్రాస్తున్నావు,
నాన్నా?



తప్పక చూడండి!
శ్రీస్వాతి ఫిలిమ్స్ సమర్పించు
శ్రీవిజయలక్ష్మీపిక్చర్సువారి
డిస్ట్రిబ్యూటర్స్
ఆంధ్రా: శ్రీలక్ష్మీనారాయణ పిక్చర్స్
నైజాం: ఉషా ఫిలింస్ - సీడెడ్: నవభారత్ ఫిలింస్
శివలీలలు
(ఈస్ట్‌మన్‌కలర్)
మాటలు, పాటలు: శ్రీశ్రీ... సంగీతం: కె.వి.మహాదేవన్... సంగీతామకరణ: టీ.చలపతిరావు... డైరెక్షన్: ఎ.పి.నాగరాజన్
నిర్మాతలు: G.S.A.సాంబశివరావు, P.L.గణపతిరావు B.A., నిర్వహణ: పింజల



Parry's







బలము మరియు శక్తి కోసం!
పాలు
కోకో
పంచదార
మాల్ట్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఐకమత్యమే బలమని పెద్దలు చెబుతారు. పదిమంది విడి విడిగా చెయ్యలేని పనిని పదిమందీ కలిసి సాధించగలుగుతారు. అయితే పదిమందికీ ఏకదీక్ష ఉన్నంత మాత్రాన లాభం లేదు. వారి కృషి కూడా ఏకం కావాలి. అది సమిష్ఠి కృషిగా కొనసాగటానికి తగిన వ్యూహం ఉండాలి. ఆ వ్యూహం అమలు జరగాలి. అప్పుడే ఆ కృషి విజయవంత మవుతుంది. ఈ సత్యాన్ని మనం "చమరవాలుడు" [బేతాళ కథ] లో చూస్తాం.

సంపుటి 40 మార్చి '67 సంచిక 3

CHITRA



# భారత చరిత్ర



1605 నుంచి ప్రాచ్యంలో పోర్చుగీసు వారిని డచ్చివారు జయించసాగారు. వారు 1639 లో గోవాకు ముట్టడి వేశారు. 1658 నాటికి సింహళంలోని పోర్చుగీసు వలసలన్నీ డచ్చివారి అధీనంలోకి వచ్చాయి. వ్యాపారమే డచ్చివారిని ఇండియాకు తెచ్చింది. వారు గుజరాతులోనూ, కోరమండలతీరానా, బెంగాలు, బీహారు, ఒరిస్సాలలోనూ ఫాక్టరీలు నిర్మించారు. 17 వ శతాబ్ది అంతటా సుగంధద్రవ్య వ్యాపారం వారి గుత్తగా సాగింది. ఇండియాకూ, దూరప్రాచ్య దీవులకూ మధ్య డచ్చివారు వ్యాపారం పునరుద్ధరించి, విజయనగర సామ్రాజ్యంనాటి సంబంధాలను మళ్ళీ ఏర్పాటు చేశారు. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి నీలిమందూ, ముడిపట్టూ, సూరేకారమూ, బియ్యమూ, నల్లమందూ సూరతునగరంలో డచ్చివారికి చేరేవి.

అయితే 17 వ శతాబ్దిలో డచ్చివారికి ఇంగ్లీషువారికీ పోటీ వచ్చింది. ఒకప్పుడు పోర్చుగీసువారికీ, ఇంగ్లీషువారికీ సంఘర్షణలుండినా, అవి క్రమంగా సమసిపోయాయి. పోర్చుగీసువారు రెండవ చార్లెస్ (ఇంగ్లండు) రాజుకు బొంబాయిని భరణంగా ఇచ్చారు. అయితే ఇంగ్లీషువారి వర్తకాన్ని డచ్చివారు తీవ్రంగా ప్రతిఘటించారు. డచ్చివారి ప్రధాన స్థావరం మలేయు, ఇంగ్లీషువారిది ఇండియా; అయినా ఉభయులకూ ఇండియాలో సంఘర్షణ తప్పలేదు. 1672-1674 మధ్యకాలంలో డచ్చివారు తమ సూరతుకూ, ఇంగ్లీషువారి బొంబాయికీ మధ్య రాకపోకలను అనేకమార్లు భగ్నం చేశారు; బంగాళాఖాతంలో మూడు ఇంగ్లీషు వర్తకనౌకలను పట్టుకున్నారు. 1759 దాకా ఉభయుల మధ్యా వ్యాపార పోటీ తీవ్రంగానే సాగింది.

66. పాశ్చాత్యుల వర్తకపోటీలు

ఇంగ్లీషు ఈస్టిండియాకంపెనీ ఇండియాలో మొట్టమొదటి ఫాక్టరీలు ఏర్పాటు చేసే ప్రయత్నం 1608 లో జరిగింది. కంపెనీ తరఫున కాప్టెన్ హాకిన్స్ అనేవాడు 1609 లో జహంగీర్ దర్బారుకు వచ్చి, సూరతులో ఇంగ్లీషుఫాక్టరీ స్థాపించటానికి పాదుషా అనుకూల్యం కూడా సంపాదించాడు. అయితే సూరతువర్తకులూ, పోర్చుగీసువారూ పాదుషా అనుమతికి అడ్డు తగిలారు. 1611 లో హాకిన్స్ ఆగ్రా నుంచి బయలుదేరి సూరతు చేరేసరికి, సర్ హెన్రీ మిడిల్టన్ అనేవాడు మూడు ఓడలతో వచ్చి సూరతు వర్తకులను భయపెట్టాడు. అందు చేత వారు 1612 లో కాప్టెన్ బెస్ట్ అనే వాడి కింద రెండు బ్రిటిషు ఓడలను సూరతు రేవులోకి రానిచ్చారు. పోర్చుగీసువారు యుద్ధానికి తలపడితే, కాప్టెన్ బెస్ట్ వారిని ఓడించాడు. ఇంగ్లీషువారు సూరతులో శాశ్వతంగా ఫాక్టరీ నిర్మించుకోవటానికి అనుమతించుతూ జహంగీర్ 1613 లో ఫర్మానా ఇచ్చాడు. త్వరలోనే బ్రిటిషురాజు వద్ద నుంచి ఒక రాయబారి మొగలుదర్బారుకు వచ్చి వర్తక ఒడంబడిక చేసుకోగోరాడు. ఈ రాయబారి పేరు సర్ టామస్ రో. ఇతను 1615 ఆఖరు నుంచి 1618 ఆఖరు దాకా



మొగలు దర్బారులో ఉండి, వర్తకపు ఒడంబడిక సాధించలేక పోయినప్పటికీ, కంపెనీవారు మొగలు సామ్రాజ్యంలో అనేక చోట్ల ఫాక్టరీలు నిర్మించటానికి పాదుషా అనుమతీ, ఇతర సౌకర్యాలూ సాధించాడు. దీని ఫలితంగా సూరత్, ఆగ్రా, అహమ్మదాబాదు, భరూచి లలో ఇంగ్లీషు ఫాక్టరీలు వెలిశాయి. ఇంగ్లీషురాజు తనకు భరణంగా లభించిన బొంబాయిని, 1668 లో ఏడాదికి పదిపౌనుల (సవర్ల) కిరాయికి కంపెనీ పరం చేశాడు. కొద్ది సంవత్సరాలలోనే బొంబాయినగరం బాగా పెరిగి, 1687 నాటికి సూరతుపట్టణాన్ని మించిపోయి, పశ్చిమ

తీరాన బ్రిటిషువారికి ప్రధాన వ్యాపార కేంద్ర మయింది.

తూర్పుతీరాన మచిలీపట్టణంలో బ్రిటిషు వారొక ఫాక్టరీ 1611 లో పెట్టారు. గోల్కొండ రాజ్యానికి అది ప్రధాన రేవు. ఏటా 500 పగోడాలు (1750 రూపా యలు) సుంకం చెల్లించి, గోల్కొండ రాజ్యంలోని రేవు లన్నిటా స్వేచ్ఛగా వ్యాపారం చేసుకునేటందుకు ఇంగ్లీషువారికి అనుమతి ఇస్తూ గోల్కొండ సుల్తాను 1632 లో ఫర్మానా జారీచేశాడు. 1634 లో తిరిగి మరొక ఫర్మానా కూడా ఇదే షరతుతో జారీ అయింది. కాని స్థానికాధికారులు ఇంగ్లీషువారి వద్ద డబ్బు గుంజుతూ వచ్చారు. అందుచేత వారు మరొక రేవు కోసం చూడసాగారు.

1639 లో చంద్రగిరిరాజు మదరాసును బ్రిటిషువారికి కవులు కిచ్చాడు. అక్కడ వారు రక్షణలతో కూడిన ఫాక్టరీ నిర్మించారు. ఇదే ఫోర్ట్ సేంట్ జార్జ్. ఈ కోట నిర్మించాక మచిలీపట్నం ప్రాముఖ్యం పోయి, మదరాసే బ్రిటిషువారి ముఖ్య కేంద్ర మయింది.

బ్రిటిషువారి ప్రాభవం వ్యాప్తి చెంద సాగింది. 1633 లో మహానది డెల్టాలోని హరిహరపురం వద్దా, బలాసోర్‌లోనూ వారు కొత్తఫాక్టరీలు ఏర్పాటు చేశారు. 1651 లో బ్రిజ్‌మన్ అనేవాడి ఆధిపత్యాన హుగ్లీ వద్ద మరొక ఫాక్టరీ వెలిసింది. అటుతరవాత కొద్దికాలానికే పాట్నాలోనూ, కాసింబాజార్ లోనూ ఫాక్టరీలు ఏర్పడ్డాయి.

ఆ కాలంలో బ్రిటిషువారు బెంగాలులో ప్రధానంగా పట్టు, నూలువస్త్రాలూ, సూరేకారమూ, చక్కెరా వగైరాల వ్యాపారం సాగించారు. 1658 నాటికి, బెంగాలు, బీహారు, ఒరిస్సా, కోరమండల్ తీరంలోని బ్రిటిషు వలస లన్నీ ఫోర్ట్ సేంట్ జార్జ్ అధీనంలోకి తేబడ్డాయి.



# నేహ్రూ కథ

## 33



ఆరుమాసాల శిక్ష అనుభవించి జవాహరు అక్టోబరు 11న విడుదల అయాడు. దేశంలో ఉండే అర్థిక రాజకీయపరిస్థితి చూస్తే అతనికి శిస్తు ఎగవేత ఉద్యమం నడపాలనిపించింది. శాసనోల్లంఘనోద్యమం ఇంకా సాగుతూనే ఉన్నది, జనం జైళ్ళకు పోతూనే ఉన్నారు; కాని ఉద్యమంలో చురుకు తగ్గింది. అసంఖ్యాకంగా ఉన్న రైతువర్గం ఉద్యమంలో చేరితేగాని అది చురుకెక్కదు. అందుచేత జవాహరు శిస్తుల ఎగవేత ఉద్యమం లేవదీశాడు.

అలహాబాదులో జిల్లారైతు మహాసభ జరిగింది. ఒక పెద్ద బహిరంగసభ కూడా జరిగింది. జవాహరు అందులో ఉపన్యసించాడు. ప్రభుత్వం అతన్ని తిరిగి జైలుకు పంపింది. అతను జైలు బయట ఉన్నది ఎనిమిది రోజులు మాత్రమే. అతను తిరిగి జైలుకు పోవటంతో శాసనోల్లంఘనోద్యమం కాస్త చైతన్యం పొందింది.

మోతీలాలు తన అనారోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టక రాజకీయరంగంలోకి దిగాడు. ఆయన శాసనోల్లంఘనోద్యమానికి కొత్త జీవం కలిగించాడు. జవాహరు పుట్టినరోజు (నవంబరు 14) దేశమంతటా జరపబడింది. మీటింగులూ, లాఠీచార్జీలూ జరిగాయి. దేశమంతటా అయిదువేల మంది ఒక్కసారిగా అరెస్టయారు.

1931 జనవరి 1న జవాహరు భార్య కమల కూడా జైలుకు పోయి తన భర్తను కలుసుకున్నది.

మరుసటి నెలలో—ఫిబ్రవరి 6న—మోతీలాలు కన్నుమూశాడు.

భారతీయ సమస్య పరిష్కరించే మిష మీద బ్రిటిషువారు లండనులో ఒక రౌండు టేబిలు సమావేశం ఏర్పాటు చేశారు.





అందులో పాల్గొన్న మితవాద భారతీయ ప్రతినిధులు ప్రశంసనీయంగా ప్రవర్తించ లేదు. ఉన్నతోద్యోగులతో కబుర్లు చెప్పటం మించి వారికి మరొక లక్ష్యం లేకపోయింది. నిజానికి, జవాహరు చెప్పినట్టు, భారత దేశం తరఫున మాట్లాడే అర్హతగలవాడు గాంధీజీ ఒకడే.

గాంధీజీకీ, లార్డు ఇర్వినుకూ ఒప్పందం కుదిరాక, రెండవ రౌండు టేబిలు సమావేశానికి, కాంగ్రెసు ఏకైక ప్రతినిధిగా గాంధీజీ వెళ్ళాడు. ఆ సమావేశం నుంచి కాంగ్రెసు నాయకులు ఎలాంటి ఫలితాలూ ఆశించ లేదు. గాంధీజీ వట్టిచేతులతో తిరిగివచ్చాడు. ఈలోపునే ప్రభుత్వం అనేకమంది నాయకులను అరెస్టు చేసింది. వారిలో జవాహరు కూడా ఉన్నాడు.

రెండవ రౌండు టేబిలు సమావేశం విఫలం కావటం బ్రిటిషువారి విజయానికి చిహ్నంకావటమే గాక, బ్రిటిషు లేబరు ప్రభుత్వంలో భారతీయులకు విశ్వాసం లేకుండా చేసింది. అది జవాహరుకు మంచి గుణపాఠమయింది. అతను మన దేశంలో జరిగేదానికీ ప్రపంచమంతటా జరుగుతున్న దానికీ సంబంధం ఉన్నదని గ్రహించ గలిగాడు. దూరప్రాచ్యంలో జపాను చైనా పీకనొక్కుతున్నది. యూరపులో ఫాసిజం విజృంభించి, సోషల్ డెమొక్రసీని నిర్మూలిస్తున్నది. జవాహరు ఇంపీరియలిజమునూ, ఫాసిజమునూ ఎలుగెత్తి శపించాడు. ఇంపీరియలిజమూ, కాపిటలిజమూ ఇండియాకు పరమ శత్రువులని అతను భావించాడు. జాతీయువాదులు అమలులో ఉన్న వర్గ వ్యవస్థలో మార్పులు సహించేస్థితిలో లేరు. జవాహరు వారికన్న ముందుకు పోయాడు.

"ప్రపంచం ఈనాడు ఎన్నడూలేనంత సంపన్నంగా ఉన్నది. పెట్టుబడిదారీ మూలానే కృత్రిమ కరువులు ఏర్పడు తున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ఎంతో



కాలం నిలవదు. భవిష్యత్తు మాట ఎలా ఉన్నప్పటికీ, పాత వ్యవస్థ భగ్నమయింది. అది తిరిగి రాదు," అన్నాడతను.

1932-35 మధ్యకాలంలో జర్మనీలో హిట్లరు పైశాచికత్వం చెలరేగింది. ఆ కాలంలో జర్మను మేధావు లనేకమంది జైళ్ళలో ఉన్నారు. అదేకాలంలో భారతీయ మేధావులు కూడా జైళ్ళలోనే ఉండటం గమనించదగిన విషయం. జవాహరుకు ఈ కాలమంతా జైలులోనే గడిచిందని చెప్ప వచ్చు. అతను ఒకడేకాదు, అతని కుటుంబ మంతా జైలు చూసింది. మోతీలాలు భార్య తన వార్ధక్యంలో మొదటిసారిగా బ్రిటిషు వారి జైలులోకి అడుగుపెట్టి, తన కొడుకును చేరింది. విజయలక్ష్మి పండిట్, ఆమె భర్తా జైలు చేరారు. కమల కూడా జైలులోనే ఉన్నది.

కమల క్షయవ్యాధితో బాధపడుతున్నది. ఆమె పరిస్థితి తీవ్రంకావటంచేత 1935లో ఆమెను విడుదలచేస్తూ, జవాహరును కూడా విడుదల చేశారు. ఆ ఇద్దరూ జర్మనీలోని ఒక ఆరోగ్యకేంద్రానికి వెళ్ళారు. అక్కడ కమల ఆరోగ్యం కొద్దిగా మెరుగయింది.

1935 అక్టోబరు ఆఖరులో జవాహరు ఇంగ్లండు వెళ్ళాడు. అక్కడ అతనికి ఘన



మైన స్వాగతం ఇచ్చారు. అతను అక్కడ అనేక సమావేశాలలో మాట్లాడి, బ్రిటిషు పార్లమెంటులో గల నిపుణులు పరమ అజ్ఞానులనీ, భారతదేశం ఎదుర్కొనే వాస్తవ సమస్యలు వారికి తెలియవనీ, అత్యంత తీవ్రమైన నిరుద్యోగ సమస్యపట్ల ప్రభుత్వం ఏమీ చేయకుండా ఉన్నదనీ, బ్రిటిషువారు అవలంబించే విధానాలు మారనంత కాలమూ దేశంలో శాంతి ఉండదనీ చెప్పాడు. బ్రిటిషుపాలకుల కీ హితబోధ చెవిటివాడి ముందు శంఖం ఊదినట్టయింది.

జవాహరు లండనులో ఇలా ఉపన్యసించే కాలంలోనే అతను కాంగ్రెసు అధ్య

క్షుడుగా ఎన్నిక అయ్యాడు. అందుచేత భారతదేశం గురించి అతను సాధికారంగా మాట్లాడగలిగాడు.

ఫైజ్‌పూర్, లక్నోలలో జరిగిన కాంగ్రెసు సమావేశాలు జవాహరును పూర్తిగా బల పరచటమే, గాక, బ్రిటిషువారు తయారు చేసిన భారత రాజ్యాంగ చట్టాన్ని తీవ్రంగా విమర్శించాయి.

ఈలోపల కమల మృత్యువుతో పోరాటం సాగించి, చివరకు **1936** ఫిబ్రవరి **25** న దేహం చాలించింది. భారతదేశ మంతా ఆమె మృతికి సంతాపం చెందింది.

"కమలానెహ్రూ మృతి దేశానికి తీరని నష్టం," అన్నాడు గాంధీజీ.

**1936** మార్చి **11**న జవాహరు దేశానికి తిరిగి వచ్చాడు.

**1936** కాంగ్రెసు సమావేశం లక్నోలో, జవాహరు అధ్యక్షతన జరిగింది. ఇది ముఖ్యమైన సమావేశం. "పెట్టుబడిదారీ విధానం చిక్కులలో పడి ఫాసిస్టుధోరణి అవలంబించింది. ఇంపీరియలిస్టులు వలసదేశాలలో అమలు చేసే విధానాలనే ఫాసిస్టులు స్వదేశాలలో అమలు చేస్తున్నారు. రెండూ ఒకటే," అని జవాహరు తన అధ్యక్షోపన్యాసంలో అన్నాడు.

బ్రిటిషు పాలకులు రాష్ట్రాలలో కొంత స్వపరిపాలన అమలుచేస్తా మన్నారు. కాంగ్రెసు ఎన్నికలలో పోటీ చేయ నిశ్చయించింది. పదవీస్వీకార సమస్య ఎన్నికల అనంతరం నిర్ణయించవలసి ఉన్నది. అందు కొక ప్రత్యేక కాంగ్రెసు సమావేశం కూడా జరగనున్నది.

జవాహరు సోషలిజమును బలపరుస్తూ, కాంగ్రెసు వేదిక నుంచి మాట్లాడడంతో కొంత దుమారం రేగింది. సాంఘిక పరిణామం శీఘ్రంగా జరగని పక్షంలో విప్లవం తప్పదని జవాహరు తన ప్రతిపక్షులను హెచ్చరించాడు.





# పాతాళదుర్గం

## 11

[విరూపుడి సహాయం వల్ల, ధూమకుడు గరుడపక్షి బారి నుంచి బతికి బయటపడ్డాడు. తరవాత వాళ్ళకు అరణ్యంలో వికృతాకారు డొకడు కనిపించాడు. అతడు చెప్పిన దారి వెంట వెళ్ళి, ధూమకుడూ అతడి మిత్రులూ నదిలో పడవనూ, దాని చుట్టూ ఈదులాడే మొసళ్ళనూ చూశారు. సోమకుడు బాణంతో ఒక మొసలిని కొట్టాడు. —తరవాత]

సోమకుడి బాణం దెబ్బతిన్న మొసలి కీచుమని అరుస్తూ, నీళ్ళల్లో విలవిలా తన్నుకోసాగింది. ఆ తన్నుకోవటంలో పైన ధరించిన మొసలిచర్మపు తొడుగు పోయి ఒక మానవాకారం బయట పడింది. అప్పటి వరకూ పడవ చూట్టూ ఈదుతున్న మొసళ్ళన్నీ ఒక్కసారిగా తమ పై తొడుగులను తొలగించివేసి, కేకలు పెడుతూ ఒడ్డుకు ఈదుకు రాసాగినై. అవి మొసళ్ళు కాదు; మొసళ్ళ లాగా వేషాలు ధరించిన దృఢకాయులైన మనుషులు!

సోమకుడు ఆ వింత చూసి ఆశ్చర్య పోతూ, "విరూపా, ఇది ఆశ్చర్యంగా లేదా? ఎవరీ మొసలిమనుషులు? ఎవరిదీ పడవ?" అన్నాడు.

ధూమకుడు అతణ్ణి మెల్లిగా మాట్లాడమని హెచ్చరించి, "చనిపోయే ముందు ఆ వికృతాకారుడు చెప్పిన మాటలు అప్పుడే



మరిచిపోయావా? వీళ్ళు కాలకలి రాక్షసుడి బంట్లు. పడవ దగ్గిర కెవరూ రాకుండా వుండేందుకు వాళ్ళు మొసళ్ళలా కపట నాటకం ఆడుతున్నారు. వాళ్ళల్లో ఒకడి తల చితికేలా కొట్టి మనం చిక్కులో పడ బోతున్నాం. చూడు, వాళ్ళంతా ఒడ్డెక్కి మనం వున్న చెట్ల కేసే పరీక్షగా చూస్తు న్నారు," అన్నాడు.

"అవును, దొరా! బాణం వదలబోయే ముందే నాకు వాళ్ళు మనుషులై వుంటారన్న అనుమానం కలిగింది. కాని నా హెచ్చరిక్క ముందే సోముదొర బాణం వదిలేశాడు," అన్నాడు విరూపుడు.



ధూమకుడు ఓ క్షణకాలం వూరుకుని, ఏదో ఒక గట్టి నిర్ణయానికి వచ్చినవాడిలా తలాడించి, "ఆ మొసలిగాళ్ళు బాణం వచ్చిన దిక్కు కనుక్కున్నారు గాని, మనం యీ చెట్టు పైన దాగివున్నట్టు గ్రహించ లేదు, అది అసంభవం. వాళ్ళిక్కడికి వచ్చే లోపలే మనం చెట్టు దిగి, పొదలమాటున పడి, కొండ మలుపులో వున్న చెట్లగుంపు చేరదాం," అన్నాడు.

మరుక్షణంలో ముగ్గురూ కొమ్మలూ రెమ్మలూ కదలకుండా అతి జాగ్రత్తగా కిందికి దిగి, కొంత దూరం పోయి, గుబురుగావున్న పొదల వెనక భాగానికి చేరారు.

ఇంతలో మొసలిమనుషులు రెండు ముఠాలుగా చీలారు. ఒక ముఠావాళ్ళు ధూమకుడూ వాళ్ళు వదిలిన చెట్టు కేసి బయలుదేరారు. రెండో ముఠా ఆయుధాలు సర్వసన్నద్ధంగా పట్టుకుని, మరొక వైపుగా పొదలన్నీ గాలిస్తూ కొండ మలుపును చుట్టి రాసాగారు.

"ధూమూ, యీ రాక్షసబంట్లు... రెండు పదులు... ఇరవైమంది వున్నారు. మనం ముగ్గురం—మొత్తం మీద గట్టి చిక్కులోనే పడ్డాం," అన్నాడు సోమకుడు పళ్ళు కొరుకుతూ.





"ఏ చిక్కుల్లోనూ పడకుండా మనం రాజకుమార్తె కాంతిసేనను రాక్షసుడి బారి నుంచి కాపాడి తేగలమా? నీ ధైర్యసాహసాలను గురించి నాకు ఎలాటి అనుమానమూ లేదు. అంత తప్పనిసరైతే, యీ పొదలూ, పుట్టలూ గాలించే పదిమందినీ మనం హతమార్చి కొండ మీదికి పారిపోలేమా?" అన్నాడు ధూమకుడు కత్తిదూస్తూ.

ఆ వెంటనే విరూపుడు ఈటెను గుప్పెట బిగించి, ముందుకుచాచి పట్టుకున్నాడు. సోమకుడు విల్లుకు అంబు సంధించి ధూమకుడి కేసి చూశాడు. మొసలిమనుషులు తమ చేతుల్లో వున్న యీటెలతో పొదల మీద కొడుతూ, గుబురుచెట్లలోకి ఈటెలను బారుచేసి పొడుస్తూ, గొంతెత్తి, "ఎవర్రా మీరు? ఒకళ్ళా యిద్దరా? బయట పడండి. ప్రాణాలతో మా నుంచి పారిపోలేరు. కాలకలి రాక్షసేంద్రుడి మానవబంట్లల్లో ఒకణ్ణి చంపిన మీ దుస్సాహసానికి ప్రతిఫలం—నిలువునా చర్మాలు వలిపించుకోవటం!" అంటూ గావుకేకలు పెట్టసాగారు.

ధూమకుడు తతిమ్మా యిద్దర్నీ హెచ్చరించి, తా మున్నచోటు కేసి వస్తున్న మొసలి



మనుషుల్నుంచి తప్పుకునేందుకు పొదల చాటుగా నక్కుతూ కొండమలుపు కేసి బయలుదేరాడు. మొసలిమనుషుల్లో ఒకడు ధూమకుడూ వాళ్ళూ వున్న దిక్కు కేసి పరీక్షగా చూసి, "అక్కడేదో పొద కదులుతున్నది. మన వాణ్ణి చంపిన దుర్మార్గులు దానిచాటు నున్నారని నా అనుమానం," అంటూ గబగబా అటు కేసి రాసాగాడు.

రానున్న ప్రమాదాన్ని పశికట్టిన విరూపుడు, ధూమక సోమకులను ముందుకు పోవలసిందిగా హెచ్చరించి, చప్పున అర చేతుల మీదా, మోకాళ్ళ మీదా వంగి, తాను





దాగి వున్న పొదను తలతో, చేతులతో అల్లల్లాడిస్తూ, పులిలా భయంకరంగా ఒక్క రంకె వేశాడు.

అడవిలో పుట్టి పెరిగిన ఆటవికుల్లో చాలామందికి అడవి జంతువుల అరుపులూ, పక్షుల కేకలూ వేయటంలో చాలా నేర్పు వుంటుంది. విరూపుడు ఆ విద్యల్లో అందె వేసిన చేయి. అతడు పెట్టిన రంకె వింటూనే, మొసలిమనుషులందరూ భయంతో కంపించిపోయి వున్న చోటునే ఆగిపోయారు. అందరికన్న ముందు పొద దగ్గరకు పరిగెత్తు కొస్తున్నవాడు ఆ రంకెకు అదురుకుని బోర్లాపడిపోయి, లేస్తే పులి



మీద పడుతుందన్న భయంతో వెనక్కు దొర్లుకుంటూ పోసాగాడు.

"పులి! వెనక్కు తగ్గండి," అన్నాడొక మొసలిమనిషి.

"అది మామూలు పులికాదు, బాగా ఆకలిగొన్న పోతుపులి!" అన్నాడు మరొకడు.

"నీ తెలివి అఘోరించినట్టుంది. ముందు పొదల్నించి దూరంగా పరిగెత్తండి. అది ఇప్పుడే పిల్లల్నీనిన ఆడపులి, అరుపు తెలియటంలేదా?" అన్నాడింకొకడు.

వాళ్ళ విధంగా మల్లగుల్లాలు పడుతూంటే, అది అవకాశంగా తీసుకుని ధూమకుడూ అతడి మిత్రులూ పొదల మాటున దాక్కుంటూ కొండమలుపు కేసి పోసాగారు. ప్రస్తుతానికి ప్రమాదం తప్పిందన్న నమ్మకం ఆ ముగ్గురికీ ఎంతో ఉత్సాహం కలిగించింది. సోమకుడు, విరూపుడి భుజం తడుతూ, "విరూపా! ఆ దుష్టుల్ని భలే హడల కొట్టావ్ చూడు, వాళ్ళెలా వణికిపోతున్నారో," అన్నాడు.

ముందు నడుస్తున్న ధూమకుడు మొసలి మనుషుల కేసి ఓ మారు చూసి, "వీళ్ళ మాట సరే. ఆ రెండో ముఠా ఏమయింది?" అంటూ తాము దిగి పారిపోయి వచ్చిన మహావృక్షాని కేసి చూశాడు. ఆ క్షణంలోనే





అతడి శరీరం భయంతో కంపించిపోయింది. మొసలిమనుషుల రెండో ముఠా వాళ్ళిద్దరు ఆ వృక్షం చిటారుకొమ్మల మీద నిలబడి, ఎండపొడ పడకుండా కళ్ళకు చేతులడ్డం పెట్టుకుని, అంత ఎత్తు నుంచి సూటిగా తమ కేసే చూస్తున్నారు.

"సోమూ, విరూపా. మనం ఎక్కడున్నామో వాళ్ళకు తెలిసిపోయింది. క్షణంలో ఆ రెండుముఠాలూ ఏకమై మనను చుట్టుముడతారు. ఆ చిటారుకొమ్మల్లో వున్న దుర్మార్గు లిద్దర్నీ చూశారా?" అన్నాడు ధూమకుడు.

ధూమకుడు మాట ముగించేలోపలే, కొమ్మల్లో వున్న మొసలిమనుషు లిద్దరూ పోలోమంటూ పెద్ద కేక పెట్టి, "పులీ లేదు గిలీ లేదు, భయపడకండి. ఆ దుష్టులు ముగ్గురూ కొండముచ్చుల్లా పొదల వెనక దాక్కుని వున్నారు. వాళ్ళు కొండమలుపు తిరిగి కీకారణ్యంలోకి పారిపోకుండా, ఇక్కడే చుట్టుముట్టి పట్టుకోండి," అన్నారు.

"అమ్మా, రాక్షసబ్బొంటుల్లారా! మీరు మమ్మల్ని కనిపెట్టే వున్నారన్న మాట. ఆ ఇద్దర్నీ ఒకే బాణంతో కింద పడకొడతాను," అంటూ సోమకుడు విల్లంబు ఎక్కుపెట్టాడు.



"ఇద్దరో ఒకడో......ముందు బాణం వదులు. వాళ్ళు హడలుకుని చెట్టు దిగుతారు. అప్పుడు మనల్ని ఎత్తు నుంచి చూసి, మనం పారిపోయే దారి తతిమ్మా వాళ్ళకు చెప్పేవాళ్ళు వుండరు," అంటూ ధూమకుడు, సోమకుణ్ణి తొందరపెట్టాడు.

ఈ లోపల సోమకుడు గురి చూసి బాణం వదలనే వదిలాడు. అది కొమ్మల్లో వున్న ఒక మొసలి మనిషి గుండెల్లో బలంగా తాకింది. వాడు కెవ్వుమని అరుస్తూ, కింద పడబోయే సమయంలో ఆధారం కోసం ఎగిరి, పక్కనున్న రెండవవాడి నడుం పట్టుకున్నాడు. ఆ వూపుకు ఆ రెండవవాడు





చేతుల్లో వున్న చెట్టుకొమ్మ పట్టుజారి, గాయ పడిన వాడితోపాటు, అంత ఎత్తు నుంచి దభీమంటూ కింద పడిపోయాడు.

"ఒక్క వేటుకు రెండు పక్షులంటే, యిదే సోముదొరా!" అంటూ విరూపుడు ముంచు కొస్తున్న ప్రమాదాన్ని మరిచి పోయి, ఉత్సాహంగా కేకపెట్టాడు.

"పరిగెత్తండి. కొండమలుపు తిరిగితే కీకారణ్యం. అక్కడికి పారిపోగలిగా మంటే, యిక మనని యీ రాక్షసబృంట్లు పట్టుకో లేరు. మన దారిని అడ్డగించకుండా, వెనక నుంచి ఈటెవేటు దూరంలోకి రాకుండా మాత్రం, మనం వాళ్ళను ప్రతిఘటిం చాలి," అన్నాడు ధూమకుడు.

కొండమలుపు కేసి బాగా నలిగిన కాలి బాట ఒకటున్నది. ఆ బాట తొక్కినవాళ్ళు కాలకలి రాక్షసుడిబంట్లు. వాళ్ళు గూడేల మీద పడి జనాన్ని పట్టుకుపోయేందుకు వచ్చినప్పుడల్లా, యీ ప్రాంతాలనే నదిని దాటుతూంటారు. ధూమకుడూ అతడి మిత్రులూ ఆ బాట వెంట కొండమలుపు కేసి పరిగెత్తసాగారు. ఆ మలుపులోనే శత్రువుల పడవ నది ఒడ్డు నున్న పెద్ద చెట్టుబోదెకు బలమైన మోకుతో బంధించ బడి వున్నది.




ధూమకుడు వూహించినట్టు శత్రు ముఠాలు రెండూ ఏకమై వాళ్ళ వెంటబడ లేదు. వాళ్ళల్లో ఒక ముఠా కొండమలుపు కేసి పరిగెత్తసాగింది. అక్కడ ధూమకుడూ వాళ్ళ దారిని అటకాయించాలని వాళ్ళ ప్రయత్నం. ఇక రెండవ ముఠా వెనక నుంచి కాలిబాట వెంట వాళ్ళను తరుముకు రాసాగింది.

ధూమకుడు యీ రెండు గుంపుల్లో దేనికీ చిక్కకుండా కొండ ఎక్కి పారిపోయే మార్గం ఏదైనా వున్నదేమో అని చుట్టూ కలయ చూశాడు. అది సాధ్యమయేలా అతడికి కనిపించలేదు.





ఆ ప్రాంతాల కొంత భాగం పెద్ద పెద్ద రాళ్ళతో, పొదలతో కాలు మోపేందుకే వీలులేకుండా వున్నది. ఇక వున్న చోటునే నిలిచి శత్రువులతో పోరాడటం తప్ప ధూమకుడికి మరో మార్గం తోచలేదు.

"సోమూ, మనను వెనక నుంచి తరుముకు వస్తున్న వాళ్ళ మీద బాణాలు వదులు. నేనూ, విరూపుడూ ముందుండి వాళ్ళు విసిరే ఈటెలు నీకు తగలకుండా చూస్తుంటాం," అన్నాడు ధూమకుడు.

సోమకుడు చప్పున మోకాలి మీద వంగి, విల్లంబు ఎక్కుపెట్టి పరిగెత్తుకు వస్తున్న మొసలిమనుషుల్లో ఒకణ్ణి కొట్టాడు. బాణం తగలగానే వాడు ఒక చావు కేక పెట్టి కింద పడిపోయాడు. అదే అదనుగా సోమకుడు మరొక బాణంతో ఇంకో శత్రువును కొట్టాడు. కాని, యీసారి బాణం మొసలిమనిషి గుండెల్లో కాకుండా, భుజంలో గుచ్చుకున్నది. వాడు కెవ్వున అరిచి చతికిలబడ్డాడు. మొసలిమనుషులు భయపడి కాలిబాట వదిలి తుప్పలచాటుకు పరిగెత్తారు.

"సోమూ, విరూపా! కొండమలుపులో మనను అటకాయించేందుకు పరిగెత్తుతున్న దుర్మార్గుల మీదా యిదే మంత్రం ప్రయోగించాలి. ఏవీ, శత్రువులు మన మీద విసిరిన ఈటెలు?" అంటూ ధూమకుడు ఆ ప్రాంతాల పడివున్న ఈటెలు రెండు తీసుకుని ముందుకు పరిగెత్తసాగాడు. విరూపుడూ, సోమకుడూ కూడా కొన్ని ఈటెలు తీసుకుని అతణ్ణి అనుసరించారు.

ఆ సరికి మొసలిమనుషుల్లో రెండో ముఠా కొండమలుపును చేరింది. వాళ్ళు ఈటెలు పైకెత్తి ఆడిస్తూ, "లొంగిపొండి! మిమ్మల్ని చంపకుండా కాలకలి రాక్షసేంద్రుడి పాతాళదుర్గానికి తీసుకుపోతాం. అలా చేయకపోయారో యివ్వాళతో మీకు భూమ్మీద నూకలు నిండుకున్నట్టే," అంటూ కేకలు వేశారు. —(ఇంకావుంది)





# చమరవాలుడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ వీ పనికి ఏ దుర్ముహూర్తంలోనో పూనుకుని ఉంటావు. అందుచేతనే చమరవాలుడి శత్రువుల లాగా విజయం సాధించలేకుండా ఉన్నావు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు చమరవాలుడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు హస్తినాపురాన్ని చమరవాలుడనే మహాబలశాలి పాలిస్తూ ఉండేవాడు. అతని రాజ్యపు సరిహద్దుల మీద అయిదుగురు రాజులు—సమరబలుడూ, సమరశూరుడూ, సమరజితుడూ, ప్రతాపచంద్రుడూ, ప్రతాపసేనుడూ—ఉండేవారు. చమరవాలుడితో పోల్చితే వారు అల్పులు;

**బేతాళ కథలు**




సరిహద్దు మీద వారి రాజ్యాలుండటం చేత, చమరవాలుడికి అణగిమణగి ఉండవలసి వచ్చేది. చమరవాలుడి వైభవం ముందు వాళ్ళు సామంతుల కన్న కూడా హీనంగా ఉండేవాళ్ళు. ఇది వారందరికీ ఎంతో దుర్భరంగా ఉండేది.

ఒకసారి ఈ అయిదుగురూ ఒకచోట కలిసి ఆలోచన చేశారు. "ఎవరికి వారుగా మనం చమరవాలుడికి ఏ మాత్రమూ చాలం. అతను మన అందరికీ పక్కలోబల్లెం లాగా ఉంటున్నాడు. స్వతంత్రరాజులమై ఉండి కూడా మనం అతనికి ఇష్టం లేని పని ఏదీ చెయ్యలేని స్థితిలో ఉన్నాం. మనమందరమూ ఏకమై ఎదిరించినట్టయితే అతను మనకు చాలడు. మన ఉమ్మడిబలాలు అతని బలాల కన్న చాలా ఎక్కువ. అందుచేత అతను మన ముందు నిలవలేడు. అతన్ని ఓడించాక మన పరువుమర్యాదలకు లోటుండదు. మనం నిజంగా స్వతంత్రులముగా వ్యవహరించ గలుగుతాము," అని నిశ్చయించుకున్నారు.

వాళ్ళు ఒక జ్యోతిష్కుణ్ణి పిలిచి, "మేము అయిదుగురమూ, మా సైనిక బలాలను వెంటబెట్టుకుని హస్తినాపుర రాజు పైకి యుద్ధానికి పోబోతున్నాము. అందుకు తగిన ప్రయాణ ముహూర్తం చూడు," అన్నారు.

జ్యోతిష్కుడు మీనమేషాలన్నీ గుణించి, "ఈ సంవత్సరం యుద్ధప్రయాణ లగ్నం కనబడదు. కనక ఈ యేటికి మీరు యుద్ధం మాట తలపెట్టకుండా ఉండటం శ్రేయస్కరం. కాదు, కూడదు, ఏదో ఒక ముహూర్తం పెట్టమంటే పెడతాను. కాని అందువల్ల మీకు అపజయమే కలుగుతుంది," అన్నాడు.

రాజులకు ఈ మాట ఏమాత్రమూ నచ్చలేదు. "జయాపజయాల సంగతి మాకు వదిలేసి, ప్రయాణ ముహూర్తం ఏదో ఒకటి

చూడు," అన్నారు వారు. జ్యోతిష్కుడు వారికి ఉన్నంతలో ఒక మంచి ప్రయాణ ముహూర్తం తెలిపాడు. ఆ ముహూర్తానికే అయిదుగురు రాజులూ తమ సేనలను వెంటబెట్టుకుని చమరవాలుడి పైకి యుద్ధానికి వెళ్ళారు. వాళ్ళ సేనలలో ముప్పైవేల ఏనుగులూ, మూడులక్షల గుర్రాలూ, కోటి కాల్బలమూ ఉన్నాయి.

చమరవాలుడి సైన్యమంతా కలిసి పదివేల ఏనుగులూ, లక్ష గుర్రాలూ, ఇరవై లక్షల కాల్బలమూ మాత్రమే. శత్రుబలాలు తన బలాలకన్న చాలా హెచ్చు అయినప్పటికీ చమరవాలుడు లక్ష్యపెట్టక, మహాశూరులైన యోధులను వెంటబెట్టుకుని యుద్ధానికి వచ్చాడు. యుద్ధంలో అతను వీరవిహారం చేసి వరసగా ముగ్గురు శత్రురాజులను తానే ఓడించి బందీలుగా పట్టుకున్నాడు. మిగిలిన ఇద్దరినీ చమరవాలుడి సేనాపతి, ప్రతీహారీ పట్టుకున్నారు. మొత్తం మీద అయిదుగురూ ఓడిపోయి చమరవాలుడికి బందీలుగా చిక్కారు. వారి సేనలు చెల్లాచెదురుగా పారిపోయాయి.

చమరవాలుడు కొంతకాలం ఆ అయిదుగురు రాజులనూ తన కారాగృహంలో ఉంచి, తరవాత విడిచిపెట్టి, వారి రాజ్యాలు వారికి తిరిగి ఇచ్చేశాడు.



బేతాళు డీ కథ చెప్పి, "రాజా, చమర వాలుడి కన్న ఎన్నో రెట్లు సేనలుండి కూడా సమరబలుడు మొదలైనవారు ఎందుకు ఓడిపోయారు? మంచి లగ్నం లేకుండా యుద్ధప్రయాణం చెయ్యటం చేతనా? లేక చమరవాలుడు వారందరికన్న కూడా పరాక్రమవంతుడు కావటం చేతనా? లేక యుద్ధరంగలో చమరవాలుణ్ణి ఎదుర్కో గానే వారి తీర్మానం నీరుకారి పోవటం చేతనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఒక చోట చేర్చినంత మాత్రం చేత అనేక చిన్న సేనలు ఒక పెద్దసేన కావు. సమరబలుడు మొదలైనవాళ్ళు యుద్ధం చెయ్యటానికి ఏకమయారు కాని, వారు తమ సేనలను ఒకే సేనగా తీర్చిదిద్దలేదు. జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారం ఒక సంవత్సరం ఆగి తమ సేనలను ఏకనాయకత్వం కింద తీర్చిదిద్దినట్టయితే, ఆ సమిష్టి సేన చమరవాలుడి సేనను ఓడించగలిగి ఉండేది. అది అలా ఉండగా, సమరబలుడు మొదలైనవారు తమ ఉమ్మడి సేనల సంఖ్య చూసి చమరవాలుడు బెదిరి పారిపోతా డనుకున్నారు గాని, అతను యుద్ధానికి దిగితే ఎలా గెలవాలో ఆలోచించలేదు. అందుచేతనే వాళ్ళు ఒక్కొక్కరుగా అతనితో యుద్ధం చేసి ఓడిపోయారు. అయిదుగురూ విడివిడిగా యుద్ధానికి వస్తే ఏమి జరిగి ఉండేదో, అదే జరిగింది. యుద్ధానికి తగిన ముహూర్తం లేకపోవటం అన్నది గణించనవసరం లేదు. ఎందుచేతనంటే అది చమరవాలుడికి కూడా వర్తిస్తుంది. కాని అతను యుద్ధంలో గెలిచాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పూర్ణదాసు

పూర్ణదాసు తండ్రి మోహినీవాలా సంస్థానంలో ఒక పెద్ద ఉద్యోగిగా ఉండేవాడు. దివాణం పాతకాలపు పద్ధతిలో అయోమయంగా నడిచేది. మహారాజుకు పాశ్చాత్యుల్లంటే మంచి అభిప్రాయం ఉండేది కాదు; వాళ్ళు వేసిన రైళ్ళూ టెలిగ్రాఫూ ఆయనకు చెడ్డమంటగా ఉండేవి.

అయితే పూర్ణదాసు తండ్రి మాత్రం పాతసంప్రదాయాలకు కాలదోషం పట్టిందని గ్రహించి, తన కొడుకుకు ఇంగ్లీషు చదువు చెప్పించాడు. పూర్ణదాసు బొంబాయి విశ్వవిద్యాలయంలో చదువుకుని, రాజోద్యోగిగా చేరి, మహారాజావారి సనాతన భావాలకు ఎక్కడా బాధ కలగకుండా మసులుతూ, ఒక్కొక్క మెట్టే ఎక్కి వచ్చి, చివరకు దివాను అయాడు. నిజానికి మహారాజా అమలుచేసే అధికారం కన్న దివాను అమలుచేసే అధికారమే హెచ్చు.

పాతమహారాజా పోయి, కొత్తమహారాజా వచ్చాక పూర్ణదాసుకు గౌరవం హెచ్చింది. ఎందుకంటే, కొత్తమహారాజా ఒక ఇంగ్లీషు వాణ్ణి ట్యూటరుగా పెట్టుకుని, విద్యాభ్యాసం చేసినవాడు. కొత్తమహారాజా పేరుతో పూర్ణదాసు ఆడపిల్లల పాఠశాలలు ఏర్పాటు చేశాడు; రోడ్లు వేయించాడు; వ్యవసాయ పరికరాల ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు.

ఇదంతా చూసి ఇంగ్లండులోని అధికారులూ, ఇండియా ప్రభుత్వమూ చాలా సంతోషించారు. పూర్ణదాసుకు వైస్రాయిలతోనూ, గవర్నర్లతోనూ, తదితర తెల్ల అధికార్లతోనూ మైత్రి లభించింది. ఆయనకు ఇంగ్లండు నుంచి ఆహ్వానం వచ్చింది; అక్కడ అనేకమంది జగద్విఖ్యాతపురుషుల పరిచయం సంపాదించాడు; ఉపన్యాసాలిచ్చాడు; ఇంత సంస్కారి లేడనిపించుకున్నాడు. స్వదేశానికి తిరిగి వచ్చి, ప్రాయ

ఎ. కేశవరావు





శ్చిత్తం చేయించుకోవటానికి డబ్బు పుష్కలంగా ఖర్చు చేశాడు.

పూర్ణదాసు చేసిన ఇంగ్లండు యాత్రకు ఫలితంగా మహారాజాకు ఒక గొప్ప పతకమూ, బిరుదూ లభించాయి. వైస్రాయి స్వయంగా వచ్చి మహారాజాకూ, పూర్ణదాసుకూ బిరుదులు ప్రదానం చేశాడు. పూర్ణదాసు కాస్తా సర్ పూర్ణదాసు కె.సి.ఐ.ఇ. అయిపోయాడు.

ఇది జరిగిన మరుసటి నెలలోనే పూర్ణదాసు సర్వసంగపరిత్యాగం చేసి సన్యాసం పుచ్చుకున్నాడు. నిన్నటిదాకా దివానుగా ఉన్నవాడు నేడు కాషాయాంబరాలు ధరించి, దండమూ, కమండలువూ, కృష్ణాజినమూ తీసుకుని, తన పదవినీ, ఆస్తినీ, అయిన వారినీ విసర్జించి వెళ్ళిపోవటం పూర్ణదాసు ఇంగ్లీషు మిత్రులకు అర్థమయే విషయం కాదు. కాని పూర్ణదాసు వాటిని పాతబట్టల్లాగా విసర్జించేశాడు. ఆయన ఇప్పుడు పాదచారి, ఇతరులు పెట్టే భిక్షతో జీవించవలసినవాడు.

ఆయన చీకటి పడ్డప్పుడు ఏ సన్యాసి మఠంలోనో, బైరాగి మఠంలోనో, మైదానంలోనో జింకచర్మం పరుచుకుని పడుకుంటూ హిమాలయాల కేసి ప్రయాణం చేశాడు. ఆయన పేరు ఇప్పుడు పూర్ణభక్తుడు. ఆయన హిమాలయాలలో టిబెట్టు రోడ్డు వెంబడి ప్రయాణం సాగించి అనేక కనుమలు గడిచి, మంచుశిఖరాలు చుట్టుముట్టి ఉన్న ఒక ఎత్తు ప్రదేశాన్ని చేరుకున్నాడు. ఆ ప్రదేశంలో దేవదారు చెట్లూ, మరికొన్ని ఇతర చెట్లూ అరణ్యంలాగా పెరిగి ఉన్నాయి. దేవదారు వృక్షాల మధ్య ఒక పాడుబడిన కాళికాలయం ఉన్నది.

పూర్ణభక్తుడు ఆ ఆలయం అంతా ఊడ్చి, దేవీవిగ్రహం వెనక మట్టితో పొయ్యి ఒకటి అమర్చుకుని తన జింకచర్మం పరిచి, దాని మీద కూర్చుని, చంక కింద దండం పెట్టుకుని విశ్రాంతి తీసుకున్నాడు.





ఆ ఆలయం ముందు నిట్టనిలువున చాలా లోతుగా లోయ ఒకటి ఉన్నది. అందులో ఒక చిన్న గ్రామం ఉన్నది.

పాడుబడిన కాళికాలయం నుంచి పొగ రావటం గమనించి గ్రామపురోహితుడు, కొత్త మనిషికి స్వాగతం చెప్పటం కోసమై, కొండ మీదికి ఎక్కివచ్చాడు. పూర్ణభక్తుణ్ణి చూడగానే పురోహితుడికి నమస్కారం చెయ్యాలనిపించింది. తరవాత అతను సన్యాసికి ప్రణామం చేసి, మాటా పలుకూ లేకుండా భిక్షాపాత్ర తీసుకుని, గ్రామానికి దిగివెళ్ళి, "ఎవరో మహాపురుషుడు. ఇక్కడి వాడు కాడు," అని గ్రామస్థులకు చెప్పాడు.

గ్రామంలోని ఇల్లాళ్ళు తమ శక్తికి తగ్గట్టు మంచి మంచి వంటకాలు చేసి భిక్షాపాత్ర నింపారు. పురోహితుడు దానిని తీసుకుపోయి సన్యాసికిచ్చాడు.

కాళికాలయం ముందు కూర్చుని ఉంటే అయనకు తాను సజీవుడుగా ఉన్నదీ, నిర్జీవుడుగా ఉన్నదీ కూడా తెలిసేదికాదు. ఆ ఆలయమూ, ఆ చెట్లూ, కొండలూ, ఆకాశమూ, మబ్బులూ, అవన్నీ తానే అయినట్టు భావన కలిగేది. తన ఆత్మ తన శరీరాన్ని వదిలి సర్వత్రా వ్యాపిస్తున్నట్టూ, తనకు విశ్వమంతటితోనూ తాదాత్మ్యం



కలగబోతున్నట్టూ అనిపించేది. అంతలోనే ఆ భావంపోయి తన ఆత్మ తన శరీరంలోనే బంధింపబడినట్టు స్పృహకలిగేది.

రోజూ గ్రామం నుంచి ఎవరో ఒకరు వచ్చి ఆయనకు భోజనం ఇచ్చి వెళ్ళేవారు. ఆయన రాకపూర్వం అనేక జంతువులు ఆ కాళికాలయంలోకి వస్తూ పోతూ ఉండేవి. అవి తిరిగి రాసాగాయి. నిశ్చలంగా కూర్చుని ఉండే పూర్ణభక్తుడు వాటి ప్రాణానికి అక్కడి రాళ్ళలో ఒకటిగా తోచి ఉండాలి.

మొట్టమొదట ఆయనను సమీపించినవి కొండముచ్చులు. వాటికి అక్కర్లేనిదంటూ ఉండదు. అవి భిక్షాపాత్రను దొర్లించి





చూశాయి; దండాన్ని కొరికిచూశాయి; జింక చర్మాన్నిచూసి కనుబొమలు ఎగరేశాయి; సన్యాసి తమకు అపకారం చెయ్యడని నిశ్చయించుకున్నాయి. సాయంత్రం పూట అవి దేవదారుచెట్ల నుంచి దిగివచ్చి, చేతులు చాచి, ఆయనను ఆహారం యాచించేవి; పొయిమంట దగ్గిరచేరి వెచ్చగా కూర్చునేవి. రోజల్లా ఏదో ఒక కొండముచ్చు ఆయన పక్కనే కూర్చుని, దూరంగా కనిపించే మంచుశిఖరాల కేసి దిగులుగా చూసేది. ఒక్కొక్క రాత్రి ఏదో కొండముచ్చు వచ్చి ఆయన కప్పుకున్న దుప్పటిలో దూరి పడుకునేది.

కోతుల తరవాత హిమాలయపు దుప్పులు ఆయనకు మాలిమి అయాయి. ఆయనచేత ఒళ్ళు నిమిరించుకునేవి. వాటివెనక కస్తూరీ మృగాలూ, ఒక ఎలుగుబంటీ కూడా ఆయనకు అలవాటయాయి. ఆయన వాటిని "భాయీ! భాయీ!" అని పిలిచేవాడు.

ఇలా కొన్ని ఏళ్ళు గడిచాయి. ఒక ఏడు ఆ ప్రాంతంలో అపరిమితంగా వర్షాలు కురిశాయి. సాధారణంగా వాన మబ్బులు కాళికాలయం ఎత్తుకురావు. అవి లోయను వర్షంలో ముంచెత్తాయి. పూర్తిగా ఒక నెల పాటు పూర్ణభక్తుడికి లోయలోని గ్రామం కనిపించనేలేదు.

ఒకనాటి రాత్రి ఆయనకు నిద్రాభంగమయింది. ఎవరో ఆయన దుప్పటి పట్టుకుని లాగుతున్నారు. ఆయన తడివిచూస్తే కొండముచ్చు చెయ్యి తగిలింది. కొండముచ్చు తన దుప్పటిలో దూరి పడుకుంటుంది కాబోలనుకున్నాడాయన. కాని అది ఆయన చెయ్యి పట్టుకుని లాగుతున్నది. దానికి ఆకలిగా ఉన్నదనుకుని, పొయి వద్దకు వెళ్ళి, అందులో చితుకులు వేసి మంట పెద్దది చేశాడు. కాని కొండముచ్చు వాకిలి దాకా వెళ్ళి, తిరిగివచ్చి, కురుకురుమంటూ ఆయన మోకాలుపట్టి లాగింది. అది ఆయ

నను బయటికి రమ్మంటున్నది! దాని ఆలోచన ఏమిటో ఆయనకు అంతు చిక్క లేదు. ఇంతలో దుప్పి ఒకటి అక్కడికి వచ్చి, ఆయనను వెనక నుంచి వాకిలి కేసి తొయ్యా టానికి యత్నించింది. అదే సమయంలో గుడి నేల మీద పరిచిన రాళ్ళు ఎడమవు తూండటమూ, వాటి అడుగున ఉన్న మట్టిలో నుంచి చప్పుళ్ళు రావటమూ ఆయన గమనించాడు. కొండ కూలి పోతున్నది! ఆ జంతువులు ఆయనను హెచ్చరించటానికి వచ్చాయి!

పూర్ణభక్తుడు వెంటనే ఒక కర్ర వెలి గించి, దివిటీలాగా చేత పట్టుకుని, దుప్పి వీపున చెయ్యివేసి తన బరువుమోపి, కాళి కాలయం నుంచి కిందికి బయలుదేరాడు. కిందికి దిగివచ్చే దారి రొచ్చురొచ్చుగా ఉన్నది. ఇంకా వర్షం హోరుపెట్టుతూ కురుస్తూనే ఉన్నది. పూర్ణభక్తుడు దేనినీ లక్ష్యపెట్టకుండా కొండ దిగివచ్చాడు. ఆయన వెనకగా ఆయన మిత్రులైన జంతువులన్నీ వచ్చాయి. లోయ అడుగుకు చేరగానే ఆయన కమ్మరి ఇంటి తలుపుతట్టి, "లేచి, బయటికి రండి!" అని కేక పెట్టాడు.

లోపలి వాళ్ళకు ఆయన కంఠస్వరం తెలియక, "ఎవరది?" అని అడిగారు.



"కొండ జారుతున్నది, కూలుతున్నది! బయటికి వచ్చెయ్యండి!" అన్నాడాయన.

ఈ భయంకర వార్త గ్రామమంతా పాక టానికి ఎంతోసేపు పట్టలేదు. గ్రామంలో చిన్నా పెద్దా కలిసి డెబ్భైమంది.

"లోయ అవతలి పక్కనున్న కొండ ఎక్కి పదండి! అందరూ! ఎవరూ దిగబడి పోవద్దు!" అన్నాడాయన.

లోయకు అవతలి తట్టున ప్రవహించే వాగుకు అడ్డంపడి గ్రామస్థులంతా అతి వేగంగా మరొక కొండ ఎక్కి వెళ్ళారు. వాళ్ళ వెనకగా పూర్ణభక్తుడి బరువు మోస్తూ దుప్పి కూడా కొండ ఎక్కింది. అది రెండో

కొండమీది దేవదారువృక్షాల మధ్య ఆగింది. అది ఆగినస్థలం లోయకు అయిదువందల అడుగుల ఎత్తున ఉన్నది. పూర్ణభక్తుడు స్పృహతప్పి నేలకు ఒరిగిపోయాడు.

ముందు సన్నని గాలిచప్పుడు లాటిది బయలుదేరి, క్రమంగా పెద్దదై, రానురాను అతి భయంకరమైన ప్రళయగర్జనలాగా తయారయింది. గ్రామస్థులు నిలిచి ఉన్న కొండను ఏదో బలంగా తాకి, కంపింప జేసింది. తరవాత సుమారు అయిదు నిమిషాలపాటు ఏదో ఒక స్థాయిలో ధ్వని నిలిచి ఉండి, క్రమంగా అంతరించింది.

గ్రామస్థులు చెట్ల కింద ముడుచుకుని కూర్చుని, తెల్లవారటం కోసం ఎదురు చూశారు. తీరా తెల్లవారే సరికి చూస్తే లోయ పూడిపోయింది. ఎదురుగా ఉండిన కొండ మీది చెట్లు లేవు, గుడి లేదు, గుడికి వెళ్ళే దారిలేదు—ఎర్రటి మట్టిమైదానం ఉన్నది. ఒక మైలు వెడల్పూ, రెండువేల అడుగుల మందమూ గల కొండభాగం కూలి, లోయ లోకి విరిగి పడిపోయింది. లోయలో ప్రవహించే వాగు ఒకపక్క పూడిపోయి, రెండో పక్క ఎర్రటినీటి సరస్సులాగా ఏర్పడ నారంభించింది.

గ్రామస్థులు చెట్ల కిందినుంచి పూర్ణభక్తుడి వద్దకు వచ్చారు. అంతదాకా ఆయన సమీపంలో నిలబడి ఉండిన దుప్పి వారిని చూసి పారిపోయింది. పూర్ణభక్తుడు ఒక చెట్టునానుకుని, పద్మాసనం వేసుకుని, చంక కింద దండం అమర్చుకుని, కూర్చుని ఉన్నాడు. ఆయనలో ప్రాణంలేదు.

"మహానుభావుడు. సన్యాసులను సమాధి చేయవలసిన తీరుగానే కూర్చుని ప్రాణాలు వదిలాడు," అన్నాడు గ్రామ పురోహితుడు.

ఏడాది తిరిగేలోపుగా అక్కడే పూర్ణ భక్తుడి పేర ఒక ఆలయం వెలిసింది. ఆ కొండను భక్తపర్వతం అని పిలుస్తారు.





# తప్పిపోయిన ఖైదీ

ఒకనాడు పాపన్న భార్య మీనాక్షి, మరి కొందరు స్త్రీలూ పారుగూరులో జరిగిన సంతకు వెళ్ళి తిరిగి వస్తూండగా, దారిలో కాలవ ఒడ్డున, ఒక చెట్టు కింద ప్రసవ వేదనపడుతున్న ఒక పడుచు పేదరాలు కనిపించింది.

మీనాక్షి అడిగిన మీదట ఆ మనిషి, తన పేరు శారద అనీ, తానొక బిచ్చగత్తెననీ, బిచ్చమెత్తుతూ ఒక ఊరి నుంచి మరొక ఊరికి పోతుంటే దారిలో నొప్పు లారంభమయాయనీ, తనకు దేవుడు తప్ప మరెవరూ దిక్కులేరనీ చెప్పింది.

తన వెంట ఉన్న స్త్రీల సహాయంతో మీనాక్షి శారదను తన యింటికి చేర్చి, ఒక గది ఖాళీచేసి, శారదను అందులో పడుకోబెట్టి, మంత్రసానిని పిలిపించి, పురిటి సన్నాహాలు చేసింది. త్వరలోనే శారదకు ప్రసవం అయింది.

కాస్త చీకటిపడి ఇంటికి వచ్చిన పాపన్న, లోపలికి అడుగుపెడుతూనే చంటి బిడ్డ ఏడుపు విని ఆశ్చర్యపోయాడు. మీనాక్షి అతని ఆశ్చర్యానికి నవ్వుతూ జరిగిన సంగతి చెప్పింది. తన భార్య చేసినపనికి పాపన్న సంతోషించాడు.

శారదను చూస్తున్నకొద్దీ, ఆమె బిచ్చగత్తె అని మీనాక్షికి నమ్మకం కలగలేదు. శారద మాటతీరు చూస్తే బాగా బతికిన మనిషిలాగే ఉన్నది. ఆమె మెడలో బంగారు పుస్తెలున్నాయి. అంతేగాక ఆమె తన గుడ్డల మూట నుంచి రెండు బంగారు గాజులు తీసి మీనాక్షి కిస్తూ, "నా దగ్గిర ఉన్నదంతా ఇదే. మీరు నాకు చేసిన ఉపకారానికి ఏమిచ్చినా ఋణం తీరదు. వీటిని తీసుకోండి. ఇటువంటి కష్టానికి అక్కరకు వస్తాయనే వీటిని యిన్నాళ్ళూ దాచి ఉంచుకున్నాను," అన్నది.



మీనాక్షి వాటిని తీసుకోక, "మా రుణం నువేమీ తీర్చవద్దులే. వీటిని నువే ఉంచుకో, మరొకప్పుడు ఉపయోగపడతాయి. నిన్ను చూస్తే బాగా బతికిన దానివిగా కనిపిస్తావు. ఇటువంటి స్థితి కెలా వచ్చావు?" అని అడిగింది.

"అవునమ్మా. నాకు తల్లిదండ్రులు లేరు గాని, బంధువులున్నారు. అయితే నేను ఒక కటిక దరిద్రుణ్ణి రహస్యంగా పెళ్ళాడి వాళ్ళకు ఆగ్రహం తెప్పించాను. నేను గర్భవతిని కాగానే వాళ్ళు నిజం తెలుసుకుని నన్ను వెళ్ళగొట్టారు. చేసేదిలేక నేనూ, నా భర్తా ఊళ్ళవెంట బిచ్చమెత్తుతూ తిరుగుతున్నాం. ఇద్దరమూ కలిసి బిచ్చమెత్తితే మమ్మల్ని చూసి జాలిపడరు. అందుకని విడివిడిగా తిరుగుతూ సాయంకాలం వేళ ఒక చోటికి చేరుతున్నాం. నాకు నొప్పులు వచ్చిన చోట మేమిద్దరమూ కలుసుకుందామనుకున్నాం. కాని అది పడలేదు," అన్నది శారద.

ఇదికూడా మీనాక్షి పాపన్నలకు వింతగానే ఉన్నది. శారద వంటి మనిషి ఒక కటిక దరిద్రుణ్ణి ప్రేమించి పెళ్ళాడి, బంధువులను పోగొట్టుకుని, బిచ్చమెత్తుతూ చెట్టు లేని పిట్టగా జీవిస్తున్నదంటే వాళ్ళకు నమ్మ శక్యంగాలేదు.

శారద పదోరోజున స్నానంచేసింది. ఆమె కోసం ఆమె భర్త రాలేదు. వస్తాడని శారద ఎదురు చూడనూ లేదు. ఇదికూడా పాపన్నకూ మీనాక్షికీ అనుమానంగానే కనబడింది. మరి రెండు రోజులకు పాపన్న ఇంటికి రాజభటులు వచ్చి, "ఈ ఇంట్లో శారద అనే మనిషి ఉన్నదా?" అని అడిగారు.

"ఎవరా శారద? ఆమె కోసం మీరెందుకు వెతుకుతున్నారు?" అని పాపన్న రక్షకభటుల నడిగాడు.

"ఆ శారద మొగుడు పరమేశం హంతకుడు. రాజాధికారి అయిన సుబేదారును

చంపి, పట్టుబడి, విచారణ జరిగేలోపలే నిర్బంధం నుంచి తప్పించుకు పారి పోయాడు. ఆరు నెలలుగా అతన్ని పట్టు కోవటానికి పడరాని పాట్లన్నీ పడుతున్నాం. పరమేశం దొరక్కపోతే పరమేశం భార్య నైనా పట్టుకోమని రాజాజ్ఞ అయింది. ఆమెకు భర్త ఆచూకీ తెలిసే ఉండాలి. అనేకమందిని విచారించగా శారద నిండు చూలాలుగా మీ ఇంటికి చేరి, ఇక్కడ ప్రసవ మైనట్టు తెలిసింది," అన్నారు రాజభటులు.

"ప్రసవమైన స్త్రీని పట్టుకుపోవట మేమిటి? ఇంత అక్రమం నేనెక్కడా విన లేదు," అన్నాడు పాపన్న.

"రాజాజ్ఞకు క్రమమూ అక్రమమూ అంటూ ఉంటాయా?" అన్నారు భటులు.

"రాజుగారు ఆజ్ఞ ఇచ్చేటప్పుడు ఆమె బాలింతరాలుగా ఉంటుందని కలగన్నారా? బాలింతరాలని తెలిస్తే అలాటి ఉత్తరువు ఆయన ఒక్కనాటికి ఇవ్వరు, నాకు తెలుసు," అన్నాడు పాపన్న.

రాజభటుల వెంట వచ్చిన సర్దారు చిరాకుగా, "ఇవన్నీ మాతో ఎందుకు చెబు తారండీ? మేము పరమేశాన్ని పట్టుకోవటం కోసం అతని భార్యను పట్టుకుపోతున్నాం. అది రాజాజ్ఞ. మా విధి మేము నిర్వర్తించి తీరాలిసిందే!" అన్నాడు.





"నేనే పరమేశాన్ని. నన్ను పట్టుకు పొండి," అన్నాడు పాపన్న.

రాజభటులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. వాళ్ళ సర్దారు మటుకు బేడీలు తీసి పాపన్న చేతులకు తగిలించి, "ఇక పదండి!" అన్నాడు తనవాళ్ళతో.

ఇదంతా జరిగేటప్పుడు మీనాక్షి అక్కడే నిలబడి ఉన్నది. ఆమె ఏమీ అనలేదు. కాని శారద పెద్దపెట్టున ఏడుస్తూ బయటికివచ్చి, "అయ్యయ్యో, ఆయనను పట్టుకుపోకండి. ఆయన నా భర్తకారు. నాభర్త హంతకుడూ కాడు. అంతా అయోమయంగా తయారయింది," అన్నది.



"నువ్వూరుకో, అమ్మా. నాకేమీ ప్రమాదం లేదు," అన్నాడు పాపన్న.

మీనాక్షి శారదను పొదివిపట్టుకుని, "ఊరుకో! ఏడవకు! అన్యాయం ఏమీ జరగదు. అయోమయ మంతా సరి అవుతుందిలే," అన్నది.

రాజభటులు పాపన్నకు బేడీలు వేసి తీసుకుపోతుంటే గ్రామంలో కొందరు నిర్ఘాంతపోయారు. గిట్టనివాళ్ళు, "ఈ పాపన్న సామాన్యుడా? రహస్యంగా ఎవతెనో చేరదీశాడు. అది గర్భిణీ అయి పాపన్న ఇంటి మీద వచ్చిపడి తిష్ఠవేసింది. పాపం బద్ద లయేసరికి, రాజభటులు పాపన్నను పట్టుకు పోతున్నారు," అన్నారు.

రాజభటులు పాపన్నను నగరానికి తీసుకుపోయి, కొత్వాలు ఎదటపెట్టారు.

"తప్పించుకు పారిపోయిన హంతకుడు పరమేశమే దొరికాడు. పట్టుకువచ్చాం!" అన్నాడు సర్దారు.

కొత్వాలు పాపన్ననూ, భటులనూ తీసుకుని సుబేదారు కచ్చేరీకి వెళ్ళాడు. కొత్త సుబేదారు పాపన్నను చూసి గుర్తుపట్టి, "మీకేమైనా మతులు పోయాయా? ఈయన హంతకుడేమిటి? పరమేశం ఏమిటి? ముందా బేడీలు ఊడదియ్యండి," అని కేక

వేశాడు. ఇంతలో ఒక మనిషి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "వారిని ఖైదులో పెట్టకండి. ఆయన ధర్మరాజు. పరమేశాన్ని నేను!" అన్నాడు.

పాపన్న ఆ మనిషి కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆ మనిషి గడ్డాలూ, మీసాలూ పెరిగి, జబ్బుపడి లేచినవాడులాగా ఉన్నాడు. బట్టలన్నీ చిరిగి, మట్టికొట్టుకుని ఉన్నాయి.

సుబేదారు ఆ మనిషి కేసి ఆశ్చర్యంగా చూసి, "నువా పరమేశానివి? నిన్ను పట్టుకోవటానికి బ్రహ్మప్రళయమైపోయెనే. అట్లా కూర్చో, నీ కోసం ఎందుకు వెతుకుతున్నామో చెబుతాను," అన్నాడు.

తరవాత సుబేదారు పాపన్నకు అసలు కథంతా చెప్పాడు.

పాత సుబేదారును హత్య చేసినది పరమేశం కాదు, మరొక దుర్మార్గుడు. వాడు హత్య చేసిన కత్తిని పరమేశం పుస్తకాలలో పెట్టాడు. పరమేశం సుబేదారు కచ్చేరీలో పనిచేసేవాడే. అనుమానం బలంగా ఉండటంచేత పరమేశాన్ని పట్టుకున్నారు. తనకు ఉరి శిక్ష పడుతుందన్న భయంతోనో ఏమో, పరమేశం నిర్బంధం నుంచి తొందరపడి తప్పించుకుని పారిపోయాడు. అప్పట్లో పరమేశాన్ని పారిపోయిన హంతకుడుగానే భావించి పట్టుకోవటానికి ప్రయత్నించారు.



కాని కొద్దిమాసాలక్రితం అసలు హంతకుడు ఏదో దెబ్బలాటలో చావు దెబ్బలు తిని, తానే పాత సుబేదారును చంపినట్టు వాఙ్మూలం ఇచ్చి మరీ చచ్చాడు. పరమేశం మీద ఉన్న నేరం తొలగిపోయింది. పరమేశాన్ని తిరిగి ఉద్యోగంలో వేసుకోమనీ, అక్రమంగా పట్టుకుని నిర్బంధంలో ఉంచినందుకు పరిహారం ఇవ్వవలసిందనీ రాజుగారు ఉత్తరువిచ్చారు. అదిమొదలు పరమేశం కోసం రాజభటులు వెతుకుతున్నది అతన్ని విచారణ చేసి ఉరితీయటానికి కాదు. అయితే ఈ సంగతి రాజభటులకూ తెలియదు, పరమేశానికీ తెలియదు. అతను రాజభటులకు అందకుండా తిరుగుతున్నాడు.

పరమేశం ఎంతకాలానికీ దొరక్కపొయ్యేసరికి, కనీసం అతని భార్యనైనా పిలిపించి, ఆమెకు పరిహారం చెల్లించమని రాజాజ్ఞ అయింది. దాన్ని కొత్వాలూ, రాజభటులూ ఈ విధంగా అమలు జరిపారు.

సుబేదారు జరిగిన పొరబాటుకు పాపన్నకు క్షమాపణ చెప్పుకున్నాడు.

"చాలా సంతోషం. ఈ శుభవార్త వినటానికి నాలుగురోజులు ఖైదులో కూర్చోవలసి వచ్చినా నేను విచారించను. అయితే, ఈ పరమేశాన్ని నా వెంట తీసుకుపోయి ఆయన బిడ్డకు బారసాలా, నామకరణమూ వగైరాలు జరిపించటానికి అనుమతి ఇవ్వండి," అన్నాడు పాపన్న.

"నిరభ్యంతరంగా తీసుకుపొండి. అతనిపై ఏ ఆరోపణా లేదు," అంటూ సుబేదారు ఖజానాదారును పిలిచి, పరమేశానికి పరిహారం తాలూకు డబ్బూ, పాపన్నకు ఖర్చులూ ఇప్పించాడు.

పాపన్నను రాజభటులు పట్టుకుపోయినప్పుడు దుఃఖంతో కన్నీరు కార్చిన శారద అతను తన భర్తను వెంటపెట్టుకుని ఇంటికి తిరిగి రాగానే ఆనందబాష్పాలు రాల్చింది.





# మతిభ్రమ

కొళిపట్టణపు రాజకుమారుడు చంద్రభానుడు తన తండ్రితో గాని, అన్నలతో గాని చెప్పకుండా దేశయాత్రకు బయలుదేరాడు. అతను ఒక మహారణ్యం ప్రవేశించి, దానిలో నుంచి బయటికి వచ్చే మార్గం తెలియక, రోజల్లా ప్రయాణించి, చీకటిపడ్డాక ఒక ఇల్లు చేరుకున్నాడు. ఆ ఇంట ఒక ముసలిదీ, ఒక పడుచుపిల్లా మాత్రమే వున్నారు. మగదిక్కు లేకుండా ఆ నిర్జనవనంలో వాళ్ళిద్దరూ ఎలా ఉంటున్నారో చంద్రభానుడికి అర్థం కాలేదు.

"అందరికీ దిక్కు ఆ భగవంతుడే ఉన్నాడు. నేను కదలలేని స్థితిలో ఉన్నాను. నా కూతురు చంద్రిక నాకే లోటూ రాకుండా చూస్తున్నది," అన్నది ముసలిది.

చంద్రిక వంట చేసి అతనికి దివ్యమైన భోజనం పెట్టింది. ఆ భోజనం చూసి అతను ఆశ్చర్యపడ్డాడు. చంద్రికను చూస్తే అతనికి మరింత ఆశ్చర్య మయింది. ఆ పిల్ల ఆ ముసలిదాని కూతురంటే నమ్మశక్యంగా లేదు. ఇద్దరికీ ఎలాంటి పోలికలూ లేవు. అంతేగాక చంద్రిక మసిపాతలో కట్టిన మాణిక్యం లాగున్నది.

ఆ రాత్రి అతను ముసలిదాని ఇంటనే పడుకున్నాడు. కాని అతనికి సరిగా నిద్ర పట్టలేదు. పట్టిన నిద్రలోనే అతని కొక పీడ కల వచ్చింది. ఆ కలలో తా నొక కుక్క అయినట్టూ, తనను ఒక చోట కట్టి ఉంచినట్టూ, తాను మాట్లాడబోయి మూలిగినట్టూ అతను కలగన్నాడు. అంతలోనే అతనికి నిద్రాభంగ మయింది. అతను కళ్ళుతెరిచి చూసేసరికి తాను పడుకున్న చోట ఉండటానికి బదులు గోడవార కూర్చుని ఉన్నాడు. అతనికి ఎదురుగా చంద్రిక నిలబడి ఉన్నది.

"వ్యవధి లేదు. తూర్పు తెల్లవారేసరికల్లా ముసలిది మళ్ళీ తిరిగి వస్తుంది.

టి. మాణిక్యాంబ




ఈ లోపల నేను నిన్ను అడివి దాటిస్తాను," అన్నది చంద్రిక అతన్ని తొందర చేస్తూ.

చంద్రభానుడు ప్రశ్నలు వేసి కాల యాపన చెయ్యక, చంద్రిక వెంట బయలు దేరాడు. దారిలో చంద్రిక అతనికి ఆ ముసలిదాన్ని గురించిన రహస్యమంతా చెప్పేసింది.

ఆ ముసలిది ఒక మంత్రగత్తె. కేశవ పురం రాజుగారి దివాణంలో మంత్రసానిగా ప్రవేశించి, ఆ రాజుభార్య రెండవసారి ఆడపిల్లను కన్నప్పుడు ఆ బిడ్డను మార్చేసి, ఆ స్థానంలో తన బిడ్డను పెట్టేసింది. ఆ రాణి కన్నబిడ్డే చంద్రిక.

ముసలిది ప్రతి రాత్రీ ఎటో వెళ్లి, తెల్ల వారుతూండగా తిరిగి వస్తుంది, ఇంటికి కావలిసిన వస్తువులన్నీ తెస్తుంది. పగలు నిద్ర లేచినది మొదలు రాత్రి పడుకోబోయే దాకా ఇంటి చాకిరి అంతా చంద్రికే చెయ్యాలి. చంద్రికకు ముసలిది కొన్ని మంత్రాలూ, తంత్రాలూ నేర్పింది. కాని ముసలిదానికి తెలియకుండా చంద్రిక చాలా విషయాలు నేర్చుకున్నది.

"రాత్రి నువు నిద్రపోగానే ముసలిది నిన్ను కుక్కను చేసి కట్టేసి మరీ బయలు దేరింది. నిన్ను బహుశా కుక్కగానే ఉప యోగించుకుందామని ఆవిడ ఉద్దేశమేమో. నేను నిన్ను మనిషిగా మార్చేశాను. ముస లిది వచ్చి నిన్ను గురించి అడిగితే నా కేమీ తెలియదంటాను. నేను నిన్ను మనిషిని చెయ్యగలనని ఆవిడకు తెలీదు. కుక్కగానే తప్పించుకు పోయావనుకుంటుంది. ఈ అర ణ్యం దాటి బయటపడితే నీకు ముసలిదాని పీడ ఉండదు," అని చంద్రిక చంద్రభాను డితో చెప్పింది. తాను కల అనుకున్నది వాస్త వంగానే జరిగినట్టు అతను తెలుసుకున్నాడు.

"నాతోపాటు నువు కూడా ముసలిదాని నుంచి తప్పించుకు పోరాదా?" అని అతను చంద్రికను అడిగాడు.

"తప్పించుకుని ఎక్కడికిపోను ? మాది దూరదేశం. నే నక్కడికి ఒంటరిగా పోలేను. వెళ్ళినా, నేనే తమ అసలు కూతురినని నా తల్లిదండ్రులు నమ్మరు. నేను పుట్టిన మరుక్షణం నుంచీ నాకీ ముసలిదే తల్లిగా ఉంటున్నది. నన్ను బాగానే చూసుకుంటుంది. అలాటప్పుడు నే నావిడను వదిలి ఎక్కడికో పోవటంలో అర్థమేమిటి?" అని చంద్రిక అడిగింది.

"నీ యౌవనమూ, సౌందర్యమూ అడవి గాసిన వెన్నెల అయిపోవటం లేదా? ఈ జీవితం నీ కెలా సుఖంగా ఉంటుంది? మా దేశం వచ్చేసి, నన్ను పెళ్ళాడు. నీకు జీవితం హాయిగా గడిచిపోతుంది," అన్నాడు చంద్రభానుడు.

"ఇంతకాలం అరణ్యంలో బతికి ఇప్పుడు రాణివాసంలో ఉండగలనా? నన్ను పెళ్ళాడి నువు సుఖపడవేమో!" అన్నది చంద్రిక.

"నిన్ను పెళ్ళాడకపోతే నేను అసలు పెళ్ళే చేసుకోను," అని చంద్రభానుడు శపథం చేశాడు.

"సరే, అయితే నీవెంట వస్తాను. కాని నా భారమంతా నువే వహించాలి, గుర్తుంచుకో," అన్నది చంద్రిక.




అందుకు చంద్రభానుడు ఒప్పుకున్నాడు. ఇంకా కొంత రాత్రి ఉండగానే ఇద్దరూ అరణ్యం దాటారు. వారు అనేక దేశాలు గడిచి, చాలారోజులు ప్రయాణంచేసి, కాశీ పట్టణం సమీపానికి చేరుకున్నారు. చంద్రభానుడు చంద్రికను ఒక చెట్టు కింద ఉండమని, "నా కాబోయే భార్య నగరంలోకి నడిచి రావటం నా కెంతమాత్రమూ ఇష్టం లేదు. నేను రాజభవనానికి వెళ్ళి నీ కోసం పల్లకీ, మంగళవాద్యాలూ, దాస దాసీలూ, కానుకలూ వెంటబెట్టుకుని వచ్చి, ఊరేగింపుతో మా ఇంటికి తీసుకు పోతాను," అని చెప్పాడు.



"నువు ఒక్కడివే ఇంటికి పోతే నన్ను మరిచిపోతావేమో. నాకు కాలినడకన రాజ భవనానికి రావటాని కేమీ అభ్యంతరం లేదు. ఊరేగింపూ అవీ కూడా దేనికి?" అన్నది చంద్రిక.

"భారమంతా నామీద వేశావు. నాయిష్ట ప్రకారం జరగనీ," అంటూ చంద్రభానుడు అతి వేగంగా రాజభవనానికి వెళ్ళాడు. అతన్ని ఆకస్మికంగా చూసి అందరూ ఆశ్చ ర్యపడ్డారు. వాళ్ళు వేసే ప్రశ్నలేవీ విని పించుకోకుండా, "అన్ని సంగతులూ తర వాత నింపాదిగా చెబుతాను. ముందు ఒక పల్లకీ, నౌకర్లూ, మంగళవాద్యాలూ, కాను కలూ సిద్ధం చేయించండి," అని ఆజ్ఞా పించాడు చంద్రభానుడు.

దైవికంగా ఆరోజే చంద్రభానుడి అన్నకు వివాహం జరుగుతున్నది. అందుచేత రాజ భవనం చాలా సందడిగా ఉన్నది. అంతః పురంలోవాళ్ళు అతనికి పెళ్ళికూతురినీ, ఆమె చెల్లెలినీ చూపారు. కాని అతని మన సంతా చెట్టు కింద వేచివున్న చంద్రిక పైనే ఉన్నది. అతనికి కాలు నిలవటంలేదు.

"వచ్చి క్షణం కాలేదు, మళ్ళీ ప్రయాణ సన్నాహంలో ఉన్నట్టున్నా వేమిటి? భోజనం సిద్ధంగా ఉన్నది, భోజనంచెయ్యి," అని అతని తల్లి అన్నది.

"ఇప్పుడు వ్యవధిలేదు. మళ్ళీ వచ్చి చేస్తాను," అన్నాడు చంద్రభానుడు.

"భోజనం చెయ్యటానికి వ్యవధి లేకపోతే ఈ పండయినా తీసుకోండి," అంటూ పెళ్ళి కూతురి చెల్లెలు అతని చేతికొక పండిచ్చింది. దాన్ని తీసుకున్న మరుక్షణం చంద్రభాను డికి గతమంతా మరుపుకు వచ్చింది. అతను చంద్రికను పూర్తిగా మరిచిపోయి, తనకు పండిచ్చిన పిల్ల కేసి చూశాడు. ఆమె పేరు చంద్రకళ. తన అన్నను చేసుకోబోతున్న పిల్లకు చెల్లెలు. వాళ్ళు కేశవపురం రాజు గారి కుమార్తెలు.



చంద్రకళ చంద్రభానుడి కళ్ళకు అద్భుత సౌందర్యవతిగా కనబడింది. తన అన్నతో బాటు తాను కూడా చంద్రకళను పెళ్ళాడితే బాగుండునని అతనికి తోచింది. అతను చంద్రకళను తదేకంగా చూస్తూ ఉండటం కనిపెట్టి, అతని తల్లి, "మీ ఇద్దరికీ పెళ్ళయితే చాలా ముచ్చటగా వుంటుంది, బాబూ. అందుకే నిన్ను దేవుడు ఈ సమయానికి ఇంటికి పంపాడు!" అన్నది.

చంద్రభాను ఆ మాటకు సంతోషంగా మందహాసం చేశాడు. చంద్రకళ సిగ్గుతో తలవంచుకున్నది.

ఇంతలో ఎవరో వచ్చి, "మహారాజా, మీరు కోరిన ప్రకారం పల్లకీ, భజంత్రీలూ, నౌకర్లూ అందరూ సిద్ధంగా ఉన్నారు. ఏం సెలవు?" అని అడిగారు.

"నేను కోరానా? నాకు పల్లకీలూ, భజంత్రీలూ దేనికీ? ఎవరో పొరపాటు పడ్డారు," అన్నాడు చంద్రభానుడు.

అక్కడ చంద్రిక చంద్రభానుడి కోసం గంటలతరబడి ఎదురుచూసి, తాను భయపడినంతా అయిందనీ, అతను తనను మరిచాడనీ అనుకున్నది. ఆమె అక్కడి నుంచి బయలుదేరి రాజభవనం వేపు నడుస్తూ వెళ్ళింది. రాజభవనానికి సమీపంలో ఒక విశాలమైన మైదానం ఉన్నది. దాని చివర ఒకేఒక పూరిపాక ఉన్నది.




చంద్రిక ఆ పాకలోకి ప్రవేశించి, అక్కడ ఉండే ముసలిదానితో, "అవ్వా, నన్నిక్కడ కొంతకాలం ఉండనిస్తావా? నీకు కావలిసిన పనులన్నీ చేసిపెడతాను," అన్నది.

అవ్వ సరే నన్నది.

"అవ్వా, ఈ ఇంటిని కొంచెం అందంగా చెయ్యనిస్తావా?" అని చంద్రిక అడిగింది.

"నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. నీకు చాతనైతే చెయ్యి, తల్లీ," అన్నది అవ్వ. చంద్రిక బయటికి వెళ్ళి ఒక బుట్ట నిండా ఇసుక తెచ్చి ఇంటి లోపలా బయటా గోడలకు



చల్లింది. వెంటనే ఆ పాకగోడలు బంగారు గోడల్లాగా అయిపోయాయి. అదే విధంగా చంద్రిక ఇంటి లోపలి నేల అంతా పాల గచ్చు లాగా చేసేసింది. పై కప్పు మీద గుండ్రని బంగారు గుమ్మటం వెలిసింది.

తన ఇల్లు ఇలా మారిపోవటం చూసి అవ్వకు దడ పుట్టుకొచ్చింది. చంద్రిక ఏ దయ్యమో, భూతమో అనుకుని, ఆమె ఇంటిని వదిలేసి ఎటో పారిపోయింది.

మర్నాడే రాజకుమారుల ఇంట వివాహాలు. వధూవరుల చేత ముందుగా దేవీ పూజ చేయించవలసి ఉండటం చేత, ఇద్దరు పెళ్ళికొడుకులనూ, ఇద్దరు పెళ్ళి కూతుళ్ళనూ ఒక రథంలో కూర్చోబెట్టి, పురోహితుడు మొదలైనవారు నగరం వెలుపల ఉండే ఆలయానికి బయలుదేరారు. రథం చంద్రిక ఉండే ఇంటి ముందుకు వచ్చేసరికల్లా దాని ఇరుసు విరిగింది. వెంటనే కొత్తఇరుసు తెప్పించారు. కాని అమర్చిన మరుక్షణం అది కూడా విరిగింది.

ఈ లోపల, పరివారంలో ఉన్నవాడొకడు పక్కనే ఉన్న బంగారపుటింటిని చూసి అది అంతకు ముందు అక్కడ లేకపోవటం తెలిసి, అందులో ఎవరున్నారో చూదామని లోపలికి వెళ్ళాడు.

చంద్రిక కనిపించి, "ఎవరు మీరు? వీధిలో ఏమిటా హడావుడి?" అని అడిగింది.

"రాజకుమారుళ్ళు తమ వధువులతో దేవీ పూజకు పోతూంటే దారిలో రథం ఇరుసు విరిగింది. కొత్తఇరుసు వేస్తే అది కూడా విరిగింది. ఏం మాయో తెలియటం లేదు," అన్నాడు పరివారకుడు.

"ఇంతేనా? ఈ ఇనపచువ్వ ఇరుసుగా అమర్చమను," అంటూ చంద్రిక ఒక ఇనప చువ్వను అతని కిచ్చింది.

అతను క్షణంపాటు నిర్ఘాంతపోయి, ఆ చువ్వను తీసుకుపోయి రథం మరమ్మతు చేసేవాడి కిచ్చాడు. వాడు దాన్ని ఇరుసుగా

అమర్చాడు. అది విరగకుండా నిలిచింది. "ఇక బయలుదేరండి," అని పురోహితుడు తొందర చేశాడు.

కాని ఆయన మాట పూర్తికాక ముందే, రథపు చక్రం పెళపెళా విరిగింది. అందరూ కంగారెత్తారు. ఇంకొక చక్రం తెప్పించి అమర్చారు. అది కూడా విరిగింది.

జనపచువ్వ తెచ్చిన పరివారకుడే మళ్ళీ చంద్రిక వద్దకు వెళ్ళి, "అమ్మా, మాకు మళ్ళీ చిక్కు వచ్చిపడింది. రథంచక్రం కాస్తా విరిగింది. కొత్తది వేసినా విరిగింది. దాని కేమన్నా ఉపాయం చెప్పగలవా?" అని అడిగాడు.

"దానికేముంది? ఇంటి తలుపాకటి ఇస్తాను: దాన్ని చక్రంగా అమర్చితే విరగదు," అన్నది చంద్రిక.

పరివారకుడు బంగారుతలుపు నొకదాన్ని తీసుకుని వెళ్ళి రథానికి చక్రంగా అమర్చమన్నాడు. అది విరగలేదు. ఇక ఫరవాలే దనుకుని సారథి రథం ఎక్కి కూర్చుని గుర్రాలను అదిలించాడు. కాని అవి కదలలేకపోయాయి. అప్పటికే రథానికి నాలుగు గుర్రా లున్నాయి. మరి నాలిగింటిని తెచ్చి రథానికి పూన్చారు. కాని ఎనిమిదిగుర్రాలూ లాగినా రథం కదలలేదు.



పరివారకుడు మళ్ళీ చంద్రిక వద్దకు వెళ్ళి ఉపాయం అడిగాడు.

"ఆ గుర్రాలను విప్పి, రథానికి మా దొడ్లో ఉన్న అవుదూడను కట్టండి, రథం కదులుతుంది," అన్నది చంద్రిక.

అప్పటికే వ్యవహారం అపహాస్యం కింద తయారయింది. రథానికి రథం రూపేలేదు. దానికి దూడను కట్టితే ఎలా ఉండాలో అలా ఉంటుంది. కాని పని జరగాలి గనక గుర్రాలను విప్పి, దూడను కట్టారు. వెంటనే రథం కదిలి, శరవేగంతో నడవసాగింది. ఆ దూడ సారథి చెప్పినట్టు నడవక దాని ఇష్టం వచ్చినట్టు పరిగెత్తుతూ ఊరంతా

కలయ తిరగసాగింది. చిట్టచివరకు ఆ దూడ బంగారపు ఇంటి ముందే ఆగింది.

చంద్రభానుడికి చాలా కోపం వచ్చింది. అతను ఆ ఇంటో ఉన్న మనిషిని తీవ్రంగా దండించే ఉద్దేశంతో రథం దిగి చరచరా లోపలికి వచ్చాడు. కాని చంద్రిక కనిపించగానే అతనికి గతమంతా జ్ఞాపకం వచ్చింది.

"మీ కోసం చెట్టు కింద చాలాసేపు వేచాను. మీరు రారనుకుని, నిరాశ చేసుకుని, ఈ ఇంటో మకాం పెట్టుకున్నాను. మీ వివాహమని విన్నాను. దానికేవో అంతరాయాలు కలిగితే నా శక్తి కొద్దీ సహాయ పడ్డాను," అన్నది చంద్రిక.

చంద్రభాను డామెకు క్షమాపణ చెప్పుకుని, "నేను నిన్నెలా మరిచిపోయినాను? ఏం జరిగి ఉంటుంది?" అన్నాడు.

"మరేమీ లేదు. మీరు పెళ్ళాడబోయే పిల్ల ఆ మంత్రగత్తె కూతురే. దానికి కూడా తల్లి కున్న శక్తులు కొద్దిగా ఉన్నాయి. అది మీ స్మృతిని చెడగొట్టి ఉంటుంది," అన్నది చంద్రిక.

"నేను నిన్నే పెళ్ళాడతాను. నా వెంట వచ్చెయ్యి," అంటూ చంద్రభానుడు ఆమెను చెయ్యి పట్టుకుని బయటికి తీసుకొచ్చాడు. అతను చంద్రకళతో, "నువు పాపిష్టి దానివి. నీ మూలంగానే రథానికిన్ని తిప్పలు వచ్చాయి. ఈ అపశకునం అయాక నేను నిన్ను పెళ్ళాడలేను," అని చెప్పాడు.

అతను మరొక రథం తెప్పించి, దానిలో చంద్రికతో బాటు ఎక్కి, తన అన్ననూ, అతని వధువునూ కూడా అందులో నే ఎక్కించుకుని, తిన్నగా దేవిఆలయానికి వెళ్ళాడు. దారిలో ఎలాటి విఘ్నాలూ జరగలేదు. సంగతంతా విన్నాక చంద్రభానుడి తండ్రి చంద్రికను తన కోడలుగా ఆమోదించాడు. వారిద్దరికీ ఎంతో వైభవంగా పెళ్ళి జరిగిపోయింది.





# కృష్ణావతారం

కృష్ణుడు కాళియుడి మడుగు లోకి దూకగానే, పాలసముద్రంలో మందరపర్వతం పడినట్టుగా, మడుగు లోని నీరు అల్లకల్లోలమై, దాని అలజడి రసాతలం దాకా దిగింది. కాళియుడికి చాలా కోపం వచ్చింది. వాడు తన ఐదుపడగలూ విప్పి, ఘోరమైన కోరలు కనిపించేలాగా నోళ్ళు పెద్దగా తెరిచి, నోట విషజ్వాలలు కక్కుతూ, మెలికలు తిరిగే తన శరీరాన్ని నది నిండా పరిచి, కృష్ణుణ్ణి అక్కడక్కడా కాట్లు వేసి, అతని శరీర మంతా చుట్టి, నొక్కసాగాడు. కృష్ణుడు మూర్ఛపోయాడు. అది చూసి కాళియుడి చుట్టాలూ, భార్యలూ, పిల్లలూ అయిన మహాసర్పాలన్నీ మూగి, నోళ్ళ మంటలు కక్కుతూ కృష్ణుణ్ణి కరిచారు.

ఇదంతా చూస్తున్న గోపకుమారులు బెదిరిపోయి, దక్షిణంగా కోసెడు దూరంలో ఉన్న వ్రేపల్లెకు పరిగెత్తి, అక్కడి వాళ్ళతో, "నందగోపుడి కొడుకు కృష్ణుడు, ఆడుతూ ఆడుతూ ఉన్న వాడు కాస్తా ఎవరితోనూ చెప్పకుండా, నదిలో పెద్ద పాములుండే మడుగులోకి దూకేశాడు. అన్నిటికన్నా పెద్దపాము పైనుంచి కిందికి కాలూ చెయ్యీ ఆడకుండా అతన్ని చుట్టేసింది. పాములన్నీ అతన్ని కరిచేస్తున్నాయి, పాపం. వాళ్ళ నాన్న ఎక్కడున్నాడో చెప్పండి. అందరూ వచ్చి కృష్ణుణ్ణి విడిపించే ఉపాయం చూడండి," అన్నారు.

ఈ వార్త విన్నవాళ్ళకు పిడుగు పడ్డట్టయింది. నందుడికి ఆశ్చర్యమూ,

## 7. కాళియమర్దనం





ఒకటి తెచ్చిపెట్టుకుంటాడు. చిన్నవాడు చిన్నవాడి పనులు చెయ్యడు," అన్నారు మరి కొందరు. "ఇంతకంటె పెద్దగండాలే గడిచాడు. కాళియుడికి మూడిం దనుకో పలిసిందే. కృష్ణుడి కెలాంటి భంగపాటూ రాదు, చూస్తూ ఉండండి," అన్నారు ఇంకా కొందరు.

అందరూ కాళిందీతీరాన నిలిచి కృష్ణుణ్ణి చూసి నీరుకారి పోయారు. అతను పాము చుట్లల్లో చిక్కుకుని చాలా దీనస్థితిలో ఉన్నాడు. ఎవరు గాని చేయగలిగిన దేమీ కనిపించలేదు. నందుడూ, యశోదా మూర్ఛ పోయారు. మిగిలినవాళ్ళు వాళ్ళకు శైత్యోప చారాలు చేసి స్పృహతెప్పించారు.

నందుడు మిగిలిన వాళ్ళతో, "ఏం మహాపాతకం చేసుకున్నానో ఏమో, నా బిడ్డ ఇలా పామువాత పడ్డాడు. నేను మహా పుణ్యాత్ముణ్ణనీ, అందుకే ఇంత అందమూ, బలపరాక్రమాలూ గల కొడుకును కన్నా ననీ అందరూ నన్ను మెచ్చుకుంటే దేవుడి కళ్ళు కుట్టాయి. పూతన మొదలైన వాళ్ళం దరినీ చంపినవాడు ఈ పామువాత పడి ఎలాగైనా బయట పడకపోతాడా అన్న ఆశ కూడా ఒక చెంప పుట్టుతూనే ఉన్నది. మేము ఎలాగైనా ధైర్యం చిక్కబట్టుకోగలం.

దుఃఖమూ ముంచుకొచ్చాయి. "ఎక్కడ? ఎక్కడ?" అంటూ ఆయన వార్త చెప్పిన వాళ్ళ వెంబడి బయలుదేరాడు. బలవంతు లైన గోపకు లందరూ చేతుల్లో ఆయుధాలు పట్టుకుని ఆయన కన్న ముందే పరిగెత్తారు. యశోదకు మూర్ఛ వచ్చినంత పని అయింది. ఆమె పెద్దపెట్టున ఏడుస్తూ, విడిపోయిన జుట్టుముడితో, మిగతా గోపస్త్రీలు పట్టు కుని నడిపిస్తూంటే మడుగు దగ్గిరికి బయలుదేరింది.

మొత్తానికి ఊరుకు ఊరంతా కదిలింది. "ఏం ప్రారబ్దం వచ్చి పడిందిరా!" అన్నారు కొందరు. "కృష్ణు డెప్పుడూ ఏదో





కాని కొడుకు దుస్థితి చూసి తల్లడిల్లే తల్లి దుఃఖం ఎలా పోగొట్టేటట్టు ?" అన్నాడు.

అప్పుడు యశోద కృష్ణుడితో, "నాయనా, నువు వెన్న తిన్నందుకు గోపికలు పితూరీ చేస్తే వాళ్ళను సముదాయించటానికి నిన్ను రోటికి కట్టాను. అందుకుగాను ఇవాళ నన్ని విధంగా బాధిస్తున్నావా ? ఎంతో బలం గల వాడివి, నిన్నీ పాము ఏం చెయ్యగలదురా, బాబూ ? నేనంటే నీ కిష్టం కాదూ ? ఒక్క సారి నా కేసి చూసి నవ్వవూ ? కళ్ళు తెరిచి చూడవూ ? అడవిలో గోవులు దిక్కులేక ఎలా చెల్లాచెదరయాయో చూడు. వెంటనే వచ్చెయ్యి, నాయనా. విషవృక్షాలు గల అరణ్యాన్ని ధ్వంసం చేసిన నీ కీ పామొక లెక్కా ?" అంటూ ఏడ్చింది.

అందరికీ దుఃఖం ముంచుకొచ్చింది. యశోదకు పుత్రనష్టం కలిగినట్టే భావించి తలా ఒక మాటా అన్నారు. కొందరు గోపకులు, "మనమంతా మడుగులోకి దూకి ఆ పాముతో యుద్ధం చేద్దాం. కృష్ణుణ్ణి విడిపిద్దాం. లేకపోతే ఆ కాళియుడి విషాగ్నిలో చచ్చిపోదాం. కృష్ణుడు లేకుండా వ్రేపల్లె కెలా తిరిగిపోతాం ?" అన్నారు.

బలరాముడు అంతా చూస్తున్నాడు, అందరి మాటలూ వింటున్నాడు. అతను కృష్ణుడితో చివరి కిలా అన్నాడు : "కృష్ణా, మానవస్వభావం చాటు చేసుకుని, లోకహితం మాట మరిచిపోయి, ఈ వెధవ పాముకు చిక్కి, అసహాయుడి వైపోయా వేమిటి ? నీ వాళ్ళందరూ ఎంత దైన్యంలో ఉన్నారో గమనించావా ? ఆ విషపుపురుగును శిక్షించి అందరినీ సంతోషపెట్టు," అన్నాడు.

ఈ మాట వింటూనే స్పృహ తెచ్చుకుని కృష్ణుడు కాళియుడి చుట్టలను ఒక్క తోపు తోసి, గాలిలోకి ఎగిరి బరువుగా పడగల మీదికి దూకాడు. అతను కాళియుడి తోక చేతిలోకి తీసుకుని, వాడి శిరస్సులను కాళ్ళతో మర్దన చేయసాగాడు. యమునలోని అలలు



తాళం వేస్తూండగా, తీరాన ఉన్న గోప కుల హర్షధ్వానాలు సంగీతంగా చేసుకుని, కాళియుడి తలలపై కృష్ణుడు చేసే మహా దారుణమైన నాట్యాన్ని ఆకాశం నుంచి దేవతలు చూశారు.

కాళియుడి తలలు చితికాయి. వాడి ముక్కుల రక్తధారలు కారాయి. వాడి కోరలు విరిగి, నోట మంటలతో కూడిన విషం వెలువడింది. వాడు వడిలిపోయిన తామరకాడ లాగా అయిపోయి, చచ్చే స్థితికి వచ్చాడు. ఆ స్థితిలో వాడు హీనస్వరంతో, "దేవా, నువు సర్వేశ్వరుడ వని తెలీక, తుచ్ఛమైన కోపంతో, నీ పవిత్రమైన



దేహాన్ని ఇలా చేశాను. నా మదానికి తగినట్టు శిక్షించావు. ఇక నన్ను కరుణించి, క్షమించు. నా విష మంతా దిగిపోయింది. బుద్ధి వచ్చింది. నీకు దాసుడుగా ఉండి ఏం చెయ్యమంటే అది చేస్తాను. నీ పాదాలు తాకి నేను పవిత్రుణ్ణి కావటంచేత, నీ ఆగ్రహం నాకు అనుగ్రహమే అయింది," అన్నాడు వినయంగా.

కృష్ణుడికి కాళియుడి పైన జాలి కలిగి, "ఇక నుంచీ నువు ఈ యమునానదిలో ఉండటానికి వీలు లేదు. నీ వారందరినీ వెంటబెట్టుకుని సముద్రంలోకి వెళ్ళిపో. నీ విషంతో పాడైపోయిన నీరంతా పోయి నది ఇక శుద్ధంగా ఉంటుంది, జనానికి ఉపయోగపడుతుంది. నీ తలల మీద నా కాలి గుర్తులు చూసి గరుత్మంతుడు నీ జోలికి రాడు. ఇది నేను నీ కిచ్చే వరం," అన్నాడు.

కాళియుడు తన పరివారంతో సహా అప్పుడే సముద్రం కేసి ప్రయాణమయాడు. కృష్ణుడు నదిలో నుంచి ఒడ్డుకు వచ్చాడు. తల్లిదండ్రులు అతన్ని కౌగలించుకుని దీవించారు. అతను వాళ్ళకు నమస్కరించాడు. మిగిలిన గోపకులంతా అతని చుట్టూ మూగి, తెగ ప్రశంసించుతూ, అద్భుతాశ్చర్యాలు ప్రకటించారు.



గోపకులలో ముఖ్యులైన వారందరికీ కృష్ణు డొక దేవుడు లాగే కనబడ్డాడు. "ఇంత బలమూ, ధైర్యమూ, సాహసమూ ఎక్కడా ఎవరికీ ఉండవు. నీ మహిమ జగత్తంతా కొనియాడ దగినది. మా మంద లకూ, మాకూ నీవే రక్షకుడవు. నీ దయ వల్ల ఇక గోవులు ఎక్కడ బడితే అక్కడ యథేచ్ఛగా సంచరించగలవు. ఈ నదిలో దిగే మునులకు ఎలాటి అపాయమూ ఉండదు. నీ సంగతి ఇంతకాలమూ మేము గ్రహించలేక పోయాం," అంటూ వారు అతనికి ప్రదక్షిణ చేశారు.

అతను అందరినీ తగిన విధంగా పరామర్శించి, వారందరితోనూ వ్రేపల్లెకు తిరిగి వచ్చి, ఎప్పటిలాగే సుఖంగా జీవితం గడపసాగాడు.

కొంత కాలం గడిచింది. పశువులకు మేత లేకుండా పోయింది. కృష్ణుడు మిగిలిన గోపకులతో కర్తవ్యం ఆలోచించాడు. అప్పుడు వారిలో పెద్దవాళ్ళు ఒక విషయం కృష్ణుడికి చెప్పారు.

గోవర్ధన పర్వతానికి ఉత్తరంగా, కాళిందీ నదికి దగ్గరలోనే అతి విశాలమైన తాటితోపు ఉన్నది. అందులో పచ్చిగడ్డి పుష్కలంగా ఉన్నది. అయితే అందులో ధేనుకు డనే



రాక్షసుడు గాడిద రూపంలో ఉండటం చేత అందులోకి ఏ ప్రాణీ ప్రవేశించదు.

ఈ విషయం చెవుల పడేసరికి బలరామ కృష్ణులకు ఉత్సాహం పుట్టుకొచ్చింది. వాళ్ళు ధైర్యం గల గోపకులతో, "పశువు లకు మేత వుండాలి గాని, రాక్షసులకు భయపడతామా? పదండి!" అన్నారు. వాళ్ళంతా గోవులను తోలుకుని తాటితోపుకు బయలుదేరి వెళ్ళారు. అందులో ఎటు చూసినా నవనవలాడుతూ బోలెడంత పచ్చిక. పశువులు ఆత్రంగా దాన్ని మేయ నారంభిం చాయి. కృష్ణుడు మొదలైన గోపకులు పరమానందంతో ఆ గడ్డిలో విహరించారు.



కృష్ణు డా తోపు అందం చూసి ఆనందించాడు. తాటిచెట్లు పాతాళంలో నుంచి పైకి వచ్చి, నల్లటి శరీరాలతోనూ, పడగల లాటి తలలతోనూ ఆడుతున్న పాముల్లాగా ఉన్నాయి. వాటి మీద ఉన్న తాటిపళ్ళు ఎరుపూ, నలుపూ కలిసిన రంగు కలిగి వుండి, మంచి వాసన కొడుతున్నాయి. కృష్ణుడు బలరాముడితో, "అన్నా, నువు చెట్లెక్కి పళ్ళు పడెయ్యి, నాకా పళ్ళు తినాలని ఉన్నది. ఆవులకు కూడా పెడదాం," అన్నాడు.

"ఎక్కటం చాలా ఆలస్య మవుతుందిలే. నేను చెట్ల మొదళ్ళు పట్టుకుని ఊపుతాను,



రాలిన పళ్ళను అందరూ ఏరుకోండి," అని బలరాముడు గోపకు లందరితోనూ చెప్పి, ఒక్కొక్క చెట్టునే మొదలు పట్టుకుని అవలీలగా ఊపసాగాడు. తపతపా మోత చేస్తూ తాటిపళ్ళు రాల నారంభించాయి.

ఈ ధ్వని ధేనుకాసురుడి చెవిని పడింది. గాడిద ఆకారంలో ఉండే ఆ భయంకర రాక్షసుడు, తన లాటి ఆకారాలలోనే ఉన్న వెయ్యిమంది అనుచరులు వెంట రాగా బలరామకృష్ణు లున్న చోటికి వచ్చాడు. వాణ్ణి చూసి గోపకు లంతా హడలిపోయారు.

ఇలా గాడిద లన్నీ వస్తుంటే దుమ్ము ఆకాశంలోకి లేచి మబ్బు లాగా అయింది. అవి ఓండ్ర పెడుతుంటే దిక్కులు పిక్కటిల్లాయి. అలా వచ్చే గాడిదలమందకు ముందు నడిచే ధేనుకాసురుడికి ఎదురుగా, ఉత్తచేతులతో బలరాముడు నిలబడ్డాడు. ధేనుకుడు బలరాముడికి దగ్గరగా వస్తూనే, వెనక్కు తిరిగి, వెనకకాళ్ళు రెండూ ఎత్తి, బలంగా బలరాముడి గుండెల మీద తన్నాడు. బలరాముడు ఒడుపుగా ఆ కాళ్ళు రెండూ పట్టుకుని ధేనుకుణ్ణి విసిరి పైకి ఎగరవేశాడు. ధేనుకుడి శరీరం తాటిచెట్లకు తగిలి నుగ్గునుగ్గయింది. ఆ శరీరంతో బాటు తాటిపళ్ళు కూడా చాలా రాలాయి.





బలరాముడు అంతటితో పోనీక మిగిలిన రాకాసిగాడిదలను కూడా వెనకకాళ్ళు పట్టుకుని, తాటిచెట్ల కేసి కొట్టి చంపాడు. అతనితోబాటు కృష్ణుడు కూడా ఆ రాక్షసులను చంపాడు. మొత్తం తాటితోపంతా తాటి పళ్ళతోనూ, రాక్షసుల కళేబరాలతోనూ నిండిపోయింది. గోపకులు ఆ ఇద్దరి పౌరుషాన్నీ మెచ్చుకున్నారు. రాక్షసులు చావటంతో ఆ తాటితోపు, నిరపాయ మయింది.

మరొకసారి గోపకులు భాండీరవట ప్రాంతంలో ఆవులను మేపుతూ ఆటలలో మునిగి ఉండగా, ప్రలంబు డనే రాక్షసుడు ఒక గోపకుడి రూపంలో వారితో చేరాడు. గోపబాలకు లందరూ హరిణక్రీడన మనే ఆట ఆడదలచి జంటలు జంటలుగా చీలారు. కృష్ణుడూ, అతని బావమరిది శ్రీధాముడూ ఒక జంటగా అయారు. ప్రలంబుడు బలరాముడికి జంట అయాడు. ఆ విధంగా సగంమంది కృష్ణుడి పక్షమూ, సగంమంది శ్రీధాముడి పక్షమూ అయారు. ఆట ఏమిటంటే భాండీరవటవృక్షం హద్దుగా పెట్టుకుని జింక లాగా దూకుతూ పరిగెత్తాలి. ఈ ఆటలో కృష్ణుడి పక్షంవాళ్ళు గెలిచారు. శ్రీధాముడి పక్షంవాళ్ళు ఓడారు. ఓడిన వాళ్ళు గెలిచినవాళ్ళను మూపు మీద ఎక్కించుకుని హద్దు దాకా మోసుకుపోవాలి.

అందుచేత ప్రలంబుడు బలరాముణ్ణి మూపు మీద ఎక్కించుకుని, ఎటో తీసుకుపోయి, అకస్మాత్తుగా తన రాక్షసాకారం ధరించి, ఆకాశంలోకి లేచాడు. బలరాముడు ఆశ్చర్యపడి, ఏం చెయ్యాలో తోచక, కృష్ణుణ్ణి కేకపెట్టి తన స్థితి చెప్పాడు. "వాడి అంతు తేల్చక చూస్తావేం?" అని కృష్ణుడు హెచ్చరించాడు. వెంటనే బలరాముడు పిడికిలి బిగించి, రాక్షసుడి నెత్తిన ఒక్కటి పెట్టాడు. వెంటనే రాక్షసుడు, తల పగిలి, నేలకూలి చచ్చాడు. ప్రలంబుణ్ణి చంపాక బలరాముడికి బలదేవు డనే పేరు వచ్చింది.





# అరణ్యపురాణం

## 10

మౌగ్లీ పులి చర్మం ఒలవటం పూర్తి చేసి, "దీన్ని మనం ఎక్కడన్నా దాచి, మంద లను మళ్ళించుకుపోవాలి. కాస్త సహాయం చెయ్యి, అకేలా!" అన్నాడు.

సంజెచీకట్లలో మంద మళ్ళింది. వాళ్ళు గ్రామాన్ని సమీపించే సరికి దివిటీలు కని పించాయి, గుడి నుంచి గంటలమోతా, శంఖాలమోతా వినిపించింది. ద్వారం వద్ద గ్రామస్థులలో సగంమంది అతనికోసం నిరీక్షిస్తూ నిలబడ్డారు.

"నేను షేర్‌ఖాన్‌ను చంపాను కాదూ? అందుకై ఉంటుంది, జనం యింతమంది చేరారు," అనుకున్నాడు మౌగ్లీ.

కాని అతని మీద రాళ్ళ వర్షం కురిసింది. "మాయావి! తోడేలు కొడుకు! అడవి పిశాచం! వెళ్ళిపో! త్వరగా పోకపోయావో నిన్ను పూజారి మళ్ళీ తోడేలుగా మార్చే స్తాడు. కాల్చు, బలదేవ్, తుపాకీపేల్చు!" అని గ్రామస్థులు కేకలు పెట్టారు.

బలదేవుడి తుపాకి ఢామ్మని పేలింది. ఏదో దూడ బాధతో ఆక్రోశించింది.

"చూశావా? గారడీ! వాడు తుపాకీ గుళ్ళను పక్కకు తప్పించగలడు, బలదేవ్. అది నీ దూడే," అన్నారు గ్రామస్థులు.

"ఏమిటిదంతా?" అన్నాడు మౌగ్లీ.

"ఈ నీ సోదరులకూ, తోడేళ్ళమందకూ ఆటే తేడా లేదు. దీనికంతా అర్థమేమంటే వీళ్ళు నిన్ను బహిష్కరించబోతున్నారు," అన్నాడు అకేలా.

పూజారి చేతిలో తులసిమండ ఒకటి పట్టుకుని ఊపుతూ, "ఒరే, తోడేలూ! తోడేలుకూనా! వెళ్ళిపో!" అని అరిచాడు.

"మళ్ళీనా? లోగడ మనిషి నని వెళ్ళ పొమ్మన్నారు. ఈసారి తోడేలు నని వెళ్ళ

అట్ట చివరి బొమ్మ

పొమ్మంటున్నారు. పోదాం పద, అకేలా," అన్నాడు మౌగ్లీ. ఒక స్త్రీ మంద కేసి పరిగెత్తు కుంటూ వచ్చింది. ఆ మనిషి మెస్సువా.

"నాయనా! నా తండ్రీ! నువు మంత్ర గాడివిట; తలుచుకుంటే జంతువుగా మార తావుట—వాళ్ళు అంటున్నారు. నేను నమ్మను. అయినా వెళ్ళిపో, లేకపోతే వాళ్ళు నీ ప్రాణం తీస్తారు. నువు నథూ చావుకు పగ తీర్చావని నాకు తెలుసు," అన్నదామె.

"వెనక్కురా, మెస్సువా! లేకపోతే నిన్ను కూడా రాళ్ళతో కొడతాం," అని జనం కేకలు పెట్టారు.

ఒక రాయి వచ్చి మౌగ్లీ మూతి మీద తగిలింది. అతను వికృతంగా నవ్వి, "వెనక్కుపో, మెస్సువా. ఇది సాయంకాలం పూట చెట్టు కింద చేరి వాళ్ళు చెప్పుకునే పిచ్చికథల లాంటిది. సెలవియ్యి. నేను మందను అతి వేగంగా తోలబోతున్నాను గనక నువు వెనక్కు దౌడుతియ్యి, నేను మంత్రగాణ్ణి మటుకు కాను. సెలవు, మెస్సువా!" అన్నాడు.

తరవాత, మందను తోలమని అతను అకేలాను హెచ్చరించాడు.

గేదెలు ఇల్లు చేరుకోవాలనే తొందరలోనే ఉన్నాయి. అకేలా అరుపు అవసరం లేకుం





డానే అవి సుడిగాలి లాగా ద్వారంకుండా దౌడు తీశాయి. పూజారి పక్కకు పారిపోతూ కేకలు పెట్టాడు. జనం చిందరవందరగా చెదరిపోయారు.

"నేను ఒకటీ అరా కాజేశానేమో, లెక్క పెట్టుకుని చూసుకోండి. ఇక నేను మీ గేదెల్ని కాయబోను. పిన్నలకూ, పెద్దలకూ అందరికీ—సెలవు. మెస్సువాను చూసి ఊరుకున్నాను గాని, లేకపోతే తోడేళ్ళ మందను తెచ్చి మీ వీధులలోనే మిమ్మల్ని వేటాడి ఉందును," అంటూ మౌగ్లీ గిరున వెనక్కు తిరిగి, అకేలా వెంట నడుస్తూ బయలు దేరాడు.

ఆకాశం కేసి నక్షత్రాలను చూస్తే అతనికి ఆనందం కలిగింది. "ఇక మనుషుల బోనుల్లో పడుకునే గతి నాకు లేదు. షేర్ ఖాన్ చర్మం తీసుకుని వెళ్ళిపోదాం...వద్దు, గ్రామం జోలికి మనం పోవద్దు. మెస్సువా యిన్నాళ్ళూ నన్ను చాలా దయగా చూసింది," అన్నాడు మౌగ్లీ.

ఇంతలో చంద్రోదయమై, మైదానమంతటా పిండి అరబోసినట్టు వెన్నెల ప్రసరించింది. ఆ వెన్నెలలో గ్రామస్థులకొక విచిత్ర దృశ్యం కనబడింది: మౌగ్లీ నెత్తిన ఏదో పెట్టుకుని నడుచుకుంటూ పోతున్నాడు, అతని వెనకగా రెండు తోడేళ్ళు



నడుస్తున్నాయి. అది చూసి వెళ్ళి గ్రామ స్థులు గుడి గంటను మరింత గట్టిగా వాయించి, శంఖాలను మరింత బలంగా ఒత్తారు. మెస్సువా ఏడ్చింది. బలదేవుడు తన అరణ్యానుభవాలకు చిలవలూ, పల వలూ కల్పించి చెబుతూ, చివరకు తాను, అకేలా వెనక కాళ్ళ మీద నిలబడి మనిషి లాగా మాట్లాడడం స్వయంగా చూశాననే దాకా వెళ్ళాడు.

మౌగ్లీ, రెండు తోడేళ్ళనూ వెంట బెట్టు కుని, మంద సమావేశమయే శిఖరాన్ని చేరే సరికి చంద్రుడు అస్తమించుతున్నాడు. వాళ్ళు శిఖరం పక్కనే వున్న తోడేలమ్మ గుహ వద్ద ఆగారు.

"మనిషి మంద నుంచి నన్ను తరిమే శారమ్మా. షేర్‌ఖాన్ చర్మం తెచ్చాను," అన్నాడు మౌగ్లీ.

తోడేలమ్మ లేచి వచ్చి, చర్మం కేసి తృప్తిగా చూసి, "నీ కోసం వాడొచ్చిన ఆ నాడే ఆ మాట చెప్పారా, కప్పాయ్. మంచి పని చేశావు," అన్నది.

"బాగా చేశావు, తమ్ముడూ. నువు లేక పోతే మా కేమీ తోచలేదు," అంటూ పొద లలో నుంచి బాఘీర వచ్చాడు.

మౌగ్లీ పలకరాతి మీద పులిచర్మాన్ని పరిచి, నాలుగుపక్కలా నాలుగు వెదురు శీలలు గుచ్చాడు. అకేలా వచ్చి దాని మీద పడుకుని, మౌగ్లీని మొదటిసారి తెచ్చి నప్పుడులాగే, "చూడండి, తోడేళ్ళలారా! బాగా చూడండి!" అన్నాడు.

అకేలా నాయకత్వం తొలగాక మంద చాలా దెబ్బ తిన్నది. మిగిలిన తోడేళ్ళు అకేలాతోబాటు మౌగ్లీని కూడా తమకు నాయకత్వం వహించమని కోరారు.

"నన్ను మనిషి మంద నుంచీ, తోడేళ్ళ మంద నుంచీ కూడా పంపేశారు. నేను ఒంటరిగానే వేటాడతాను," అన్నాడతను.

—(ఇంకావుంది)



# 64. వాహగి లోయలో శిలాయుగం

న్యూగినీ లోని వాహగిలోయ అపురూపమైన పక్షులకు ప్రసిద్ధికెక్కినది. ఇక్కడ అనేక వేలమంది శిలాయుగ సంస్కృతిలో జీవిస్తున్నారు. వారు ఇంకా రాతిపనిముట్లనే వాడుతున్నారు. వారికి మిగతా ప్రపంచంతో 35 ఏళ్ళక్రితం దాకా సంబంధం లేదు. చిత్రంలో కనిపించేది చింబూనది.



Photo by A. S. Lakdawala



బహుమతి
పొందిన వ్యాఖ్య

కోట చుట్టూ ప్రహరి

పంపినవారు:
ఎస్. శ్రీనివాసరావు, రాజమండ్రి

Photo by V. S. Sailam



బహుమతి
పొందిన వ్యాఖ్య

కడుతున్నారే చిన్నారి

పంపినవారు:
ఎస్. శ్రీనివాసరావు, రాజమండ్రి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 మే నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కోట చుట్టూ ప్రహరి

రెండవ ఫోటో : కడుతున్నారే చిన్నారి

పంపినవారు : సత్తి శ్రీనివాసరావు,

ఇన్నీసుపేట, రాజమండ్రి — 2

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

